# చందమామ



సంపుటి 102 | ఫిబ్రవరి 2000 | సంచిక 2

## ఈ సంచికలో...

### కథలు



### జానపద సీరియల్



### పౌరాణిక సీరియల్



### చారిత్రక విశేషాలు



### శీర్షికలు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

### ఈ నెల విశేషాలు

ముగ్గురు యక్షిణులు- మూడు వరాలు





ప్రతిభకు శరణు (బేతాళ కథ)



కల-నిజం

**పాల్గొనండి బహుమతులు గెలుచుకోండి**




చందమామ



దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి!



# చందమామ

వారి భాషలో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతి, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకి
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి.

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026


సంపాదకుడు
విశ్వం
డిజైన్ & సాంకేతిక
సలహాదారుడు
ఉత్తమ్

ముఖ్య కార్యాలయం
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్-600 026
ఫోన్: 4841778, ఫ్యాక్స్: 4835298

ఇతర కార్యాలయాలు

భువనేశ్వర్
116-బి, బి.డి.ఎ, డ్యూప్లెక్స్ హౌస్,
బారముండ, భువనేశ్వర్-751 003
ఒరిస్సా. ఫోన్:455 0534

ఢిల్లీ
ఫ్లాట్ నం. 415, 4 ఫ్లోర్
ప్రతాప్ భవన్
5, బహదుర్‌షా జఫర్ మార్గ్
ఢిల్లీ-110 002 ఫోన్:3353406/7

ముంబాయి
2/B నాజ్ బిల్డింగ్స్,
లామింగ్టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్:3889763-3886324-3877110
ఫ్యాక్స్:3889670


అమెరికాలో
విడి కాపీ
$2
సంవత్సర చందా
$20



సంచాలకులు
చక్రపాణి, బి. నాగిరెడ్డి

# గడచిన గండం!

శాంతికీ, ప్రేమకూ సంకేతమైన క్రిస్మస్ వేడుకలు జరుపుకోవడానికి ప్రపంచమంతా ఆయత్తమవుతూన్న సమయంలో, ఖాట్మండు నుంచి ఢిల్లీకి వస్తూన్న ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానం దారి మళ్ళించబడింది. ఈ దుర్ఘటన విమానంలో బందీలయిన ప్రయాణీకులకూ, భారతదేశానికీ మాత్రమే సంబంధించిన విషాదం కాదు. ఇది యావత్ మానవజాతిని తలవంచుకునేలా చేసిన దారుణకృత్యం.

ఈ దారుణకృత్యానికి పాల్పడిన ఉగ్రవాదులు నిజంగా మనుషులేనా? దేవతల్లాగే, రాక్షసులు కూడా మానవరూపాలలో వస్తారని మన పురాణాలు పేర్కొంటాయి. అలాంటి నరరూప రాక్షసులు ఈ ఉగ్రవాదులు!

మతం, రాజకీయాలు, ఆదర్శం అంటూ రకరకాల ముసుగులతో ఉగ్రవాదులు తమ దుండగాలనూ, దుష్కృత్యాలనూ సాగిస్తూవుంటారు. బాధితుల నెత్తుటి వాసనతో ఉన్మాదస్థితిని పొందే వికృత మనస్తత్వం వీళ్ళది!

ప్రత్యర్థులను ప్రత్యక్షంగా ఎదుర్కొనే ధైర్యం, శక్తిసామర్థ్యాలు లేని పిరికిపందలే- నిస్సహాయులైన వారిని భయభ్రాంతులనుచేసి, హింసించి ప్రాణాలను తీసే పాపకృత్యాలకు పాల్పడతారు. భయం, ద్వేషం అలముకున్న 'చీకటి నరకం' నుంచి పుట్టుకువచ్చిన వాళ్ళీ నీచప్రాణులు!

ఈ నరరూప రాక్షసుల దుండగాలను అరికట్టి, వాళ్ళ బెడదను అంతం చేయడానికి నాగరిక దేశాలన్నీ కృతనిశ్చయంతో పోరాడాలి. ఆఖరికి కాందహార్‌లో బందీలయిన ప్రయాణీకులందరూ, గండం గడిచి ప్రాణాలతో బయటపడడం ఎంతో ఊరట కలిగించే విషయం. అందుకు పెద్దమూల్యమే చెల్లించవలసి వచ్చింది. మునుముందు మరెవరికి గాని ఇలాంటి మూల్యం చెల్లించవలసిన అవసరం కలగకుండా ప్రపంచదేశాలు జాగ్రత్తపడాలి. ఉగ్రవాదాన్ని సమూలంగా పెకలించివేయాలి!

# చందమామ కబుర్లు

## అతిప్రాచీనమైన చేప

మహావిష్ణువు ఎత్తిన దశావతారాలలో మత్స్యావతారం,అంటే– చేప అవతారమే మొట్ట మొదటిది అని మన పురాణాలు పేర్కొంటు న్నాయి. చెట్టు చేమల తరవాత జలచరాలే మొదటపుట్టుకువచ్చాయనిపరిణామసిద్ధాంతం కూడా చెబుతున్నది.

ఆ విషయం అలా వుంచితే, భూమి మీద అసలు చేప ఎప్పుడు పుట్టింది? ఇటీవల




చైనాలోని చెంగ్‌జియాంగ్‌లో రెండు చేపల శిలాజాలు బయటపడ్డాయి. అవి దాదాపు 5,300 లక్షల సంవత్సరాలకు పూర్వం నాటివని చెబుతున్నారు. ఆ రెండు చేపల్లో ఒక చేప మరొక చేపకు పూర్తిగా భిన్నమైన జాతికి చెందినదని తెలియవచ్చింది. ఆ రెండు చేపలకూ మూలమైన, చేప మరికొన్ని లక్షల సంవత్సరాలకు పూర్వం బతికివుండవచ్చని విజ్ఞానవేత్తలు అభిప్రాయ పడుతున్నారు.

అందువల్ల అసలు చేప పుట్టుక మామూలుగా అనుకునే దానికన్నా కనీసం 500 లక్షల సంవత్సరాలకు పూర్వం నాటిదై వుంటుందని భావిస్తున్నారు!

## చుట్టుముట్టుతూన్న అపాయం!

ఇటీవల ప్రపంచ ఆరోగ్యసంస్థ జరిపిన సర్వే ప్రకారం–వాయుకాలుష్యం వల్ల యేటా ఒక లక్షమంది మరణిస్తున్నారు!



ఈ అపాయం గురించి మీ మిత్రులకు చెప్పండి. ప్రాణాలు తీస్తున్న ఈ వాయుకాలుష్య నివారణకు మన చేతనైన, మనవంతు కృషిని మనం చేసి తీరాలి. మామూలు సైకిళ్ళు సరిపోయే చోట మోటారు సైకిళ్ళ ఉపయోగాన్ని తగ్గించాలని కొన్ని దేశాలలో కోరుతున్నారు.

## నష్టాలను తగ్గించే అటవీ సంపద!



ఇటీవల ఒరిస్సాలో వీచిన పెనుతుపాను ఒరిస్సా తీరాన్ని అతలాకుతలం చేసి, వేలాది మందిని పొట్టన పెట్టుకున్నది. కొంతకాలం క్రితం ఇక్కడి సముద్రతీరంలో వున్న మాంగ్రోవ్ అడవులు ఇప్పుడు వున్నట్టయితే, ఇంత జన నష్టం, ఆస్తి నష్టం జరిగేది కాదని—ఈ విషయంగా పరిశోధనలు జరుపుతున్న కేంబ్రిడ్జ్ కోస్టల్ యూనిట్‌కు చెందిన నిపుణులు అభిప్రాయపడుతున్నారు. గత నలభైయేళ్ళలో భారత దేశంలోని సగం మాంగ్రోవ్ అడవులు నశించి పోయాయి!

# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

## శ్రీమాత

శ్రీ అరవిందులు తలపెట్టిన మహత్కార్యాన్ని మరింత ముందుకు నడిపించిన శ్రీమాతగా మన్ననలందుకుంటూన్న అమ్మ–ప్యారీస్ నగరంలో 1878వ సం॥ ఫిబ్రవరి 21వ తేదీ జన్మించారు. ఆమె పసిపాపగా ఉన్నప్పుడే తన జీవిత పరమార్థం అసాధారణమైనదని గ్రహించింది.

1914వ సం॥లో ఆమె మొట్టమొదటి సారిగా పాండిచ్చేరికి వచ్చి శ్రీ అరవిందులను దర్శించారు. ఆ మహాపురుషుడు-మానవజాతి భవిష్యత్తును దర్శించగల మహాచైతన్యస్వరూపుడని ఆమె అప్పుడే గ్రహించారు. 1920వ సం॥లో మళ్ళీ పాండిచ్చేరికి వచ్చిన ఆమె ఆ తరవాత అక్కడి నుంచి తిరిగి వెళ్ళలేదు. ఆమె రాకతో–తల్లి చుట్టూ చేరే బిడ్డల్లా, అరవిందాశ్రమవాసులందరూ అనురాగంతో ఆమె చుట్టూ చేరారు. ఆశ్రమం అభివృద్ధి చెందసాగింది.



మానవ ప్రకృతిని గురించి విభిన్న, వినూత్న భావాన్ని వెలిబుచ్చారు శ్రీ అరవిందులు. ఇంత వరకు మనిషి జీవితంలో మనసే ప్రధాన పాత్ర వహిస్తుందని భావిస్తూ వచ్చారు. మానవుడు పరిణామ క్రమంలో మరొక మెట్టు పైకి ఎగబాకగలడని శ్రీ అరవిందులు భావించారు. మనిషి మనసును అధిగమించ గలడు. మనసే ప్రధానంగాగల ఈనాటి మానవజాతి-మనసుకు అతీతమైన దివ్యమానవజాతిగా పరిణమించ గలదు.

నూతన మానవజాతి ఆవిర్భవానికి మార్గం సుగమం చేయడానికి శ్రీ అరవిందులు, శ్రీమాత యోగసాధన చేశారు. చైతన్య పరిధిలోనే వారి కృషి కొనసాగిందని గుర్తుంచుకోవడం ముఖ్యం. ఒకనాటికి మానవజాతి తప్పకుండా నూతన చైతన్యస్థాయికి ఎదుగుతుంది.

శ్రీమాత ఇలా అంటారు: రాయి రప్పల నుంచి, చెట్టు చేమలకూ; చెట్టు చేమలనుంచి జీవరాశికీ; జీవరాశుల నుంచి మనిషి వరకు ప్రకృతి పరిణామ క్రమంలో స్పష్టమైన పెరుగుదల కనిపిస్తుంది. ప్రస్తుతం మనిషి–అభివృద్ధి పరిణామ క్రమంలో ఆఖరిదశలో వుండడం వల్ల, ఈ భూప్రపంచంలో తనకు మించినది ఏదీ లేదు అని భావిస్తున్నాడు. ఇది పొరబాటు. భౌతికంగా పరిశీలిస్తే మనిషి ఇంచుమించు జంతువే; కావాలంటే ఆలోచించే జంతువు, మాట్లాడే జంతువు అని చెప్పవచ్చు. కాని అలవాట్లు, స్వభావం మాత్రం జంతువుకు దగ్గరగానే ఉన్నాయి. అనిర్దుష్టమైన, అసంపూర్ణమైన ఈ స్థాయితో ప్రకృతి ఊరుకోదు. మరింత ఉత్కృష్టమైన, ఉన్నతమైన ప్రాణికోసం ప్రయత్నిస్తుంది. జంతువునుంచి మనిషి పరిణమించినట్టు; మనిషి మరొక జీవిలా పరిణమిస్తాడు. అంటే, భౌతికంగా మామూలు మనిషిగా కనిపించినప్పటికీ, చైతన్యరూపంలో–అజ్ఞానానికి ఊడిగంచేసే మానసిక స్థితి నుంచి ఉన్నతమైన చైతన్య స్థాయిని అందుకుంటాడు.

# చందమామ

## జనవరి 2000




### సమాధానాలు

1. మేవార్ ( ఉదయ్ పూర్ ) రాణి పద్మిని; రాణా రతన్ సింగ్. దండెత్తి వచ్చిన శత్రువు అల్లాదీన్ ఖిల్జీ. 1302వ సం॥లో జరిగింది.

2. ఎ. పెదతల్లి, పినతల్లి పిల్లలు.
   బి. జరాసంధుడు కంసుడి మామ.
   సి. సవతి-సోదరులు.
   డి. కృపాచార్యుడు అశ్వత్థామకు మేనమామ.
   ఇ. సవతి-సోదరులు.

3. 1. పంచతంత్రం. విష్ణుశర్మ.
   2. గుణాఢ్యుడి బృహత్కథ. అందులోనుంచే సోమదేవుడి కథాసరిత్సాగరం రూపొందింది.
   3. బుద్ధ-జాతక కథలు.
   4. భగవద్గీత.
   5. వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు (రామాయణ, మహాభారతాలు) పురాణాలు.

# సృజనాత్మక పోటీలు

## చందమామ

పాఠకులకు ఆహ్వానం

మీ ఊహాశక్తికీ, వివిధ రంగాలలో మీ సృజనాత్మక ప్రతిభకూ పదునుపెట్టే పోటీలలో పాల్గొనండి!





## ఫోటో

వ్యాఖ్యల పోటీ

1. ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీకి కావలసిన రెండు ఫోటోలను యువఫోటోగ్రాఫర్లు పంపవచ్చు. రెండు ఫోటోలకూ పరస్పర సంబంధం ఉండాలి. ఆ సంబంధం గురించిన సొంత వివరణ రాసి, తప్పకుండా ఆ ఫోటోలతో జతచేసి పంపాలి.

ఎంపికచేయబడే (రెండు) ఫోటోలకు బహుమతి రూ.500/-

ఫోటోలు ఎప్పుడైనా పంపవచ్చు.



2. మీ పత్రికలో ఒక సామెతను ప్రచురిస్తాం. ఆ సామెతలోని విషయాన్ని వివరించే సంఘటనను గాని, సొంత అనుభవాన్నిగాని, లేదా (కొత్త/పాత) కథనుగాని 300 పదాలకు మించకుండా రాసి పంపాలి. మీరు పంపే రచనలో సామెతలకు సంబంధించిన విషయం ఉండాలే తప్ప, ఆ సామెత పుట్టిన కారణం తెలియజేసే అసలు కథను మాత్రం పంపకూడదు అన్న విషయం గుర్తుంచుకోండి.

ఈ నెల సామెత: "దూరపు కొండలు నునుపు"

ఎంపికచేయబడే రచనకు బహుమతి రూ. 500/-

మీ రచనలు ఫిబ్రవరి 29లోగా మాకు చేరాలి.
గెలుపొందిన రచన మే నెల సంచికలో ప్రచురించబడుతుంది.
మీ ఎంట్రీలను ఈ చిరునామాకు పంపండి:
**చందమామ సృజనాత్మక పోటీలు**
చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026

—సంపాదకుడు




బేతాళ
కథలు

# ప్రతిభకు శరణు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకున్న పట్టుదలా, ఎంతశ్రమకైనా ఓర్వగల గుండెదిటవూ, శక్తిసామర్థ్యాలూ చూస్తూంటే, లోకంలో నీలాంటి వాళ్ళు చాలా అరుదుగా వుంటా రనుకుంటాను. అయినా, నువ్వు వాటిని ఉపయోగించుకుంటున్న తీరు వింతగానూ, అసంబద్ధంగానూ వున్నది. ఇంతకూ నువ్వు దేన్ని సాధించగోరి, ఇంత అర్ధరాత్రి వేళ ఈ శ్మశానంలో తిరుగుతున్నట్టు!



ఆ సాధించ దలచిన దాన్ని గురించి నీకు స్పష్టమైన అవగాహన వున్నదా? అది లోపించినప్పుడు వివేకశర్మలాగా, సాధించినదాన్ని ఆఖరి క్షణంలో చేజార్చు కోగలవు. నీకు హెచ్చరికగా వుండేందుకు, అతడి కథ చెబుతాను, శ్రమ తెలియ కుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

సాహిత్యపురంలో వివేకశర్మ అనే కవి వుండే వాడు. ఆయన ఎన్నో కావ్యాలు రాశాడు. విన్న వారందరూ అలాంటి కావ్యాలు తాము జీవితంలో వినివుండ లేదని మెచ్చుకునేవారు.

అయితే, వివేకశర్మ గురించి సాహిత్య పురంలోనే చాలా మందికి తెలియదు. తనను గురించి తెలియకపోయినా, నలుగురూ తన కావ్యాలు చదివితే, అందువల్ల సమాజానికి ప్రయోజనమని ఆయన అనుకునేవాడు. కానీ అదీ జరగలేదు.

"సామాన్యులు నీ కావ్యాన్ని చదవా లంటే, అందుకు ప్రచారం కావాలి. ఒక భాగ్యవంతుణ్ణి ఆశ్రయించు. పెద్ద సభ చేయించు. నీకు సన్మానం జరిపించమను. అక్కడ నీ కావ్యంలోని గొప్పతనంగురించి నువ్వూ చెప్పు, అందరిచేతా చెప్పించు. అప్పుడే సామాన్యులకు నీ కావ్యం పట్ల ఆసక్తి పుడుతుంది!" అని ఒక మిత్రు డాయనకు సలహా యిచ్చాడు.

అందుకు వివేకశర్మ, "నేను చెప్ప కుండా నా కావ్యం గొప్పతనం అందరికీ తెలియాలి. అప్పుడే నాకు సంతోషం. నువ్వు చెప్పింది చేయడం నావల్లకాదు," అని మిత్రుడి సలహాను తిరస్కరించాడు.

ఇలా వుండగా– ఆ దేశపు రాజు ప్రగల్భ వర్మ ఒక చాటింపు వేయించాడు. ఆయన స్వయంగా మహాకవి అయినప్పటికీ, మరొక కవితో కలిసి కావ్యం రాయాలని వున్నదట! తానెన్నుకున్న మహాకవికి ఘన సన్మానం, అఖండ ప్రచారం చేయగలనని, ఆయన చాటింపు సారాంశం.

ఇది విన్న వివేకశర్మ మిత్రుడు, "ఇది చాలా మంచి అవకాశం. ఏ కవికైనా రాజాదరణ తెచ్చే గుర్తింపును మించినది లేదు. వెంటనే వెళ్ళు," అని ఆయనను ప్రోత్సహించి అప్పటికప్పుడే ప్రయాణం కట్టించాడు.

రాజధాని చేరుకున్న వివేకశర్మకు సులభంగానే రాజదర్శనమయింది. ఆయన, రాజుకు తను రాసిన కావ్యాలు కొన్ని యిచ్చాడు. రాజు కూడా ఆయనకు తన కావ్యాన్నిచ్చి, "తమరిది చదివి మీ అభిప్రాయం చెప్పండి. నేనూ మీ కావ్యాలు చదివి, నా అభిప్రాయం చెబుతాను. ఒక వారం రోజుల తర్వాత, మనం మళ్ళీ కలుసుకుందాం," అన్నాడు.

వివేకశర్మ తనకు రాజు ఏర్పాటు చేసిన విడిదిలో విశ్రమించి, ఆ కావ్యాన్ని అమిత శ్రద్ధగా చదివాడు. అది చదవడాని కాయనకు, ఒక్క రోజు సరిపోయింది. మిగతా రోజులాయన, తనకులాగే రాజ ధానికి వచ్చి, తన వసతికి పక్కగదుల్లో వుంటున్న మరి నలుగురు కవులను కలుసుకుని సంభాషించాడు.

ఆ కవుల సమర్థత అంతంత మాత్రమే నని అర్థం చేసుకున్న వివేకశర్మ, వారితో, "మీ భావాలు, పరిజ్ఞానం అద్భుతంగా వున్నాయి. కానీ మీకు భాషమీద పట్టు లేదు. చమత్కారంగా విషయాన్ని చెప్పే నేర్పులేదు. అందుకింకా కొంతకాలం పాటు గురుశుశ్రూష చేయవలసివుంది," అని సలహా యిచ్చాడు.

విచిత్రమేమిటంటే, ఆయన సలహా ఆ కవులకు కోపం కలిగించలేదు. ఆ విషయం ముందే తెలిసినవారిలా వాళ్ళు నవ్వారు. వారిలో ఒకడు, వివేకశర్మతో, "మీరు చెప్పిన గొప్పకవుల లక్షణాలన్నీ, మా గురువులకున్నాయి. కానీ వారిక్కడికి



రాలేదు. వారు పంపితేనే మేమిక్కడికి వచ్చాం," అని చెప్పాడు.

వివేకశర్మ ఆశ్చర్యపడి, "మన మహారాజు తల పెట్టిన మహాకావ్యరచన, ఒక మహా కార్యం. దానికి మీరు కాక, మీ గురువులు వస్తేనే ఎంతో బాగుండేది," అన్నాడు.

"అయితే, మీకు మన రాజుగారి గురించి బాగా తెలిసినట్టులేదు!" అన్నారా నలుగురు కవులు– ఏకకంఠంతో.

ప్రగల్భవర్మ గురించి, ఆ కవుల ద్వారా వివేకశర్మకు చాలా కొత్త విషయాలు తెలిశాయి.

ప్రగల్భవర్మ స్వతహాగా గొప్పవాడు కాదు. కానీ ఆయనకు అన్ని విద్యల్లోనూ రాణించాలని కోరిక. అయితే ఆయన రాజుకొడుకు కాబట్టి రాజు కాగలిగాడు!



కానీ అదే విధంగా వీరుడు, కవి, గాయ కుడు, చిత్రకారుడు కాలేడు కదా!

ప్రగల్భవర్మ చిన్నప్పటినుంచీ పట్టు దలతో కృషిచేసి, అన్నివిద్యల్లోనూ కొంత ప్రావీణ్యం సంపాదించాడు. ఆయన రాజు కాబట్టి అందరూ ఆయనను, అన్నింటికీ పొగుడుతుండేవారు. ఆయన అది నిజ మనుకునేవాడు. రాజయ్యాక ఆయనకు ఎందరో మహాకళాకారుల సాన్నిహిత్యం లభించింది. ప్రతి కళలోనూ తానెంత వెనకబడి వున్నాడో, అప్పటి కాయనకు తెలిసివచ్చింది. తను మహాకళాకారుడు కాలేనన్న విషయం ధృవపడ్డాక, ఆయనలో ఎక్కడలేని చింతా పుట్టింది.

మహామంత్రి ఆయన చింత అర్థం చేసుకుని, "ప్రభూ! ఇప్పుడు ప్రపంచ మంతటా శాంతి వర్ధిల్లుతున్నది. కాబట్టి మన దేశానికి యుద్ధభయం లేదు. రాజ్యం సుభిక్షంగా వున్నది. అందువల్ల, పరి పాలనలో కొత్త అంశాలు ప్రవేశ పెట్టనవసరంలేదు. ఎవరు సింహాసనం మీదవున్నా, రాజ్యపాలన చక్కగానే కొన సాగుతూంటుంది. తమరు తమకంటే ప్రతిభావంతులను చూసి భరించ లేకున్నారు. అందువల్ల, తమరి మనసు పాడవుతున్నది. కాబట్టి, ప్రతిభావంతు లకు పదవులనివ్వకండి. వారిని తమ దగ్గరకు రానివ్వకండి. తమకంటే తక్కువ వారినే, తమ చుట్టూ వుంచుకోండి. నిజమైన ప్రతిభావంతులకోసం శరణా లయాన్నొకదాన్ని నెలకొల్పండి. అత్య వసర పరిస్థితుల్లో వారినుంచి సలహాలు తీసుకోండి. ఆ సలహాలు ఆచరణలో పెట్టి లాభం పొందండి," అని సలహా యిచ్చాడు.

ప్రగల్భవర్మకు, మహామంత్రి పై కోపమే వచ్చిందో, ఆయన సలహా నచ్చిందో తెలి యదుకానీ, వెంటనే శరణాలయాన్నొకదాన్ని మాత్రం నెలకొల్పాడు. ముందు మహా మంత్రినే అక్కడకు పంపి, తనకు తలూపే వాడినొకడిని ఎన్నుకుని, కొత్తమంత్రిని చేశాడు. తర్వాత సేనాధి పతినికూడా శరణా లయానికి పంపి, యుద్ధవిద్యల్లో తనకంటే తక్కువవాడిని సేనాధిపతిగా నియమిం చాడు. ఆ విధంగా, ఆస్థానకవులూ, పలు పురు కళాకారులు కూడా శరణాలయంలో చేరారు. ఆస్థానంలో మిగిలినవారందరూ, ఆయనకంటే అన్నివిధాలా తక్కువవారే!

శరణాలయంలో చేరినవారికి సకల సదుపాయాలూ వుంటాయి. నెలనెలా హెచ్చు జీతం కూడా లభిస్తూంటుంది. రాజడిగినప్పుడల్లా సలహాల నివ్వడ మొక్కటే వారి బాధ్యత. అందుకు వారికి గుర్తింపు వుండదు. పైగా, శరణాలయంలో వుండేవారు ప్రతిభావంతులే అయినప్పటికీ, వారి ప్రతిభవల్ల ప్రజలకు ప్రయోజన ముండదన్న ప్రచారం సాగింది. అందు వల్ల, ప్రజలకు శరణాలయంలో వుండే వారిపట్ల సదభిప్రాయంలేదు. ప్రతిభకు ఆ విధంగా గుర్తింపునిచ్చే రాజు సహృ దయతనే ప్రజలు ప్రశంసిస్తూంటారు.

ఇదంతా తెలిశాక, ఒకసారి వివేకశర్మ శరణాలయానికి వెళ్ళాడు. అక్కడ ప్రతిభా వంతులందర్నీ కలుసుకున్నాడు. వారి అసాధారణ ప్రతిభకు అతడెంతో ఆశ్చర్య పడ్డాడు. అక్కడి కొందరు కవులవద్ద, తన కావ్యాలుండడంచూసి, అవి ఎలావచ్చా యని అడిగాడు.

"ఇది రాసిన మహాకవి తమరా? మీ దర్శనభాగ్యంతో మేము కృతార్థుల మయ్యాం. ఈ కావ్యాలు శ్రద్ధగా చదివి, అభిప్రాయం చెప్పవలసిందిగా, ప్రగల్భ వర్మ ప్రభువు మమ్మల్నడిగాడు. ఈ కావ్యాలు అన్నివిధాలా ఉత్తమమైనవి," అంటూ ఆ కవులు, ఆ కావ్యాల్లోని తమకు నచ్చిన ఉత్తమాంశాలు చెప్పారు.

వివేకశర్మకు ఎంతో సంతోషమైంది. "మీరు నిస్సందేహంగా అసమానమైన ప్రతిభ కలవారు. అలాంటప్పుడు, ఈ శరణాలయంలో ఎందుకుండిపోయారు?" అని అడిగాడు.

"మాకిక్కడ రోజులు సుఖంగా ఏలోటూ లేకుండా వెళ్ళిపోవడం, ఒకకారణం. ఈ శరణాలయంలో గొప్పపాండిత్య ప్రతిభ వున్నవారికి మాత్రమే స్థానం లభిస్తుంది. అందువల్ల, సత్సాంగత్యం లభిస్తుందన్నది రెండవ కారణం. ఇకపోతే నిజమైన ప్రతిభావంతుడికి గుర్తింపును గురించి





తపన వుండదు. మా సలహాలు రాజుకూ, ఆవిధంగా ప్రజలకూ ఉపయోగపడితే, అదేమాకు తృప్తినిస్తుంది. ఆ తృప్తి మూడవ కారణం. ఈ అన్నికారణాల వల్ల మేమే ఈ శరణాలయంలో వుండగలుగు తున్నాము," అని ఆ కవులు, వివేకశర్మకు చెప్పారు.

ఇంతజరిగినా వివేకశర్మ సాహిత్య పురానికి తిరిగి వెళ్ళిపోలేదు. ఆయన గడువుకాలం వారం రోజులూ ఆగి, రాజు ప్రగల్భవర్మను కలుసుకున్నాడు.

"నా కావ్యంపై తమ అభిప్రాయం చెప్పండి, మహాకవీ!" అన్నాడు ప్రగల్భవర్మ.

"ప్రభూ! తమకు భాషపై గొప్ప పట్టున్నది. కానీ తమ భావాల్లో పటుత్వమూ లేదు, కొత్తదనమూ లేదు," అన్నాడు వివేకశర్మ.

"నేను తమరి కావ్యాలు చదివాను. నిస్సందేహంగా తమరు అసమాన ప్రతిభా వంతులు. తమకు నా శరణాలయంలో స్థానం కల్పించాలనుకుంటున్నాను," అన్నాడు ప్రగల్భవర్మ వినయంగా.

అప్పటికే రాజు తనతో కలిసి కావ్యాలు రాయడానికి, తను ముందుగా కలుసు కున్న ఆ నలుగురు కవులనూ ఎంచు కున్నాడని తెలిసిన వివేకశర్మ, "ప్రభూ! నేను తమతో కావ్యం రాయాలనివచ్చాను. శరణాలయంపట్ల నాకు ఆసక్తిలేదు. కాబట్టి నాకు సెలవిప్పించండి," అన్నాడు.

ప్రగల్భవర్మ, వివేకశర్మకు విలువైన రత్నాలహారాన్ని బహూకరించిపంపాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వివేక శర్మ తనకు వచ్చిన మంచి అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకోవడాన్ని ఏమ నాలి? అతడికి మహాకవిగా గుర్తింపూ రాలేదు, శరణాలయంలో చేరితే లభించే సత్సాంగత్యాన్నీ వదులుకున్నాడు. ఇది అవివేకం అనిపించుకోదా? ఈ సందేహా లకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు ప్రగల్భ వర్మను గురించిన పూర్తి వివరాలు తెలియని పరిస్థితుల్లో, వివేకశర్మ రాజ ధానికి వెళ్ళడం జరిగింది. రాజుతో కలిసి కావ్యం రాయడమే ప్రధానమనుకుంటే, వివేకశర్మ, ఆయన రాసిన కావ్యాన్ని విమర్శించేవాడు కాదు. పైగా అప్పటికే ప్రగల్భవర్మ తనకంటే తక్కువస్థాయిలో



సువాసనలు వెదజల్లే పూలు పూసే మొక్క వనాన్నంతటినీ గుబాళింపచేసే విధంగా–గుణవంతుడైన కుమారుడు ఒక్కడు వంశానికంతటికీ కీర్తి తెస్తాడు. – చాణక్యుడు

వున్న నలుగురు కవులను, తనతో కలిసి కావ్యం రాసేందుకు ఎన్నుకుని వున్నాడు. రాజు అసలు రంగు బయటపడ్డాక, శర్మకు అక్కడ వుండాలన్న కోరిక నశించింది. అయితే, శరణాలయంలో అందరూ అసమాన ప్రతిభావంతులే! అంటే, రాజుకు సమర్థతను గుర్తించగల శక్తివున్నది, పద్ధతీ తెలుసు. ఆయన అసూయాపరుడు కావచ్చును కానీ, ఉన్న ప్రతిభను లేదనడు. వివేకశర్మ చిన్నబుచ్చినా, ఆయన అతడి కావ్యాలను మెచ్చుకున్నాడు. అంటే, ఆయన ప్రతిభకు శరణు అనగల వినయశీలి. శర్మకు రత్నాలహారం బహూకరించడమూ, శరణాలయానికి ఎన్నిక చేయడమూ–అతడి ప్రతిభను గుర్తించడమే అవుతుంది. అయితే, సత్సాంగత్యం కోసం అతడు శరణాలయంపాలు కాదలుచుకోలేదు. అక్కడి ప్రతిభ ప్రయోజనా రహితమని ప్రజల్లో అభిప్రాయ మేర్పడింది. నిజమైన ప్రతిభ గుర్తింపును కోరదు కానీ, ప్రయోజనాన్ని కోరుతుంది. తమ ప్రతిభ రాజుకూ, తద్వారా ప్రజలకూ ఉపయోగ పడాలనుకునేవారు శరణాలయంలో వుండవచ్చు. అయితే, వివేకశర్మ తన కవితాప్రాభవాన్ని సూటిగా ప్రజలకోసం ఉపయోగించదలచుకున్నవాడు. అందువల్ల అతడు రాజు ప్రగల్భుడి ఆశ్రయాన్ని తిరస్కరించడం అవివేకం కాక, గొప్ప వివేకం అనిపించుకుంటుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం:జొన్నలగడ్డ రామలక్ష్మిరచన]





# పొరబాటు ఎక్కడ?

శంకరపురంలోని శివాలయానికి భక్తులు కానుకగా వదిలిన ఆంబోతు పొగరుబోతుది. దానిని ఎవరైనా సమీపిస్తే చాలు; బుసలు కొడుతూ రంకెవేసేది. దాంతో వాళ్ళు బెదిరి పోయి పరిగెత్తేవాళ్ళు.

ఆ గ్రామ జమీందారుకు ఒక్కగా నొక్క కొడుకు శివశంకరుడు. వాడు దూర గ్రామంలో వున్న తన పినతండ్రి ఇంట వుంటూ, అక్కడి బడిలో చదువుకుంటున్నాడు. తల్లిదండ్రు లను చూడడానికి స్వగ్రామానికి వచ్చాడు.

ఒక రోజు సాయంకాలం, తన ఈడు పిల్ల లతో ఆడుకోవడానికి వాడు గుడి సమీపంలో వున్న నదీ తీరానికి బయలు దేరాడు. వాడు తన దారిన తాను వెళుతూండగా, ఆంబోతు బుసలు కొడుతూ రంకె వేసింది. వాడు హడలిపోయి పరిగెత్తాడు. అదృష్టవశాత్తు తోటి పిల్లలెవరూ వాడి బెదురుపాటును చూడ లేదు. అయినా, అది ఒక పెద్ద అవమానంగా వాడి మనసులో నాటుకుపోయింది. నదీ తీరానికి పిల్లలు ఒక్కరొక్కరుగా వచ్చారు. "గుడి ఆంబోతు చాలా పొగరుబోతు. దాని దుర్మార్గం అంతా ఇంతా కాదు. అది దేవుడి ఆంబోతు గనక, అది ఏం చేసినా దాన్ని ఎవరూ కొట్టరు. నువ్వు దాని జోలికి పోవద్దు," అని మిత్రులు వాణ్ణి హెచ్చరించారు.

అయినప్పటికీ శివశంకరుడికి వాళ్ళ మాటలు ఓదార్పు కలిగించలేదు. తాను అందరిలాంటి వాడు కాదు కదా! జమీం దారు ఏకైక కుమారుడు. ఆ ఊరికి కాబోయే జమీందారు. అందరి పైకిలాగే ఆంబోతు తన మీదికి ఉరికితే తన పరువేం కాను? దానిని ఊరక వదిలిపెట్టవచ్చా? అని ఆవేశంతో ఆలోచించసాగాడు.

ఆ సమయంలో ఒక సాధువు అటుకేసి వస్తూ కనిపించాడు. నడుం చుట్టూ బట్ట, మెడలో రుద్రాక్షలు, భుజానికి ఒక జోలె తప్ప ఆయన ఒంటిమీద మరేబట్టలూ లేవు. వేషంచూసి ఆంబోతు రెచ్చిపోయి తప్పకుండా ఆయన మీద పడుతుంది! బక్కచిక్కిన సాధువు ఎలాపరిగెత్తగలడో చూద్దామన్న ఉత్సాహంతో కుర్రవాళ్ళు ఊపిరి బిగబట్టు కుని చూడసాగారు.

శివశంకరుడు తాను అక్కడున్న వాళ్ళలో కెల్లా ప్రత్యేకమైన వాడనీ, ధైర్యవంతుడనీ చాటాలనుకున్నాడు. సాధువుకు పట్టనున్న గతిని దాపుల నుంచి చూడాలని ఆంబోతుకు

మరింత దగ్గరికి వెళ్ళాడు. అయినా, దాని వెనక వైపుగా నిలబడి దాని చూపు తన మీద పడకుండా జాగ్రత్త పడ్డాడు!

సాధువు ఆంబోతు స్వభావం తెలియని వాడు కాదు. ఆయన దానిని సమీపించే కొద్దీ నిదానంగా అడుగులు వేస్తూ మెల్లగా, "శివ శంకరా! శివశంకరా!" అంటూ దానిని దాటి వెళ్ళాడు. ఆ గుడిలోని దేవుడి పేరును భక్తితో చెబితే చాలు. దానిని వినగానే ఆంబోతు శాంతం వహించేది. కాబట్టి ఎటువంటి సమస్య లేకుండానే సాధువు బైటపడ్డాడు.

సాధువు మెల్లగా ఉచ్చరించిన దేవుడి పేరు, దగ్గరగా నిలబడ్డంవల్ల ఒక్క శివశంకరుడికి మాత్రమే వినిపించింది. ఆంబోతును శాంత పరచే రహస్యం తెలిసి పోవడంతో వాడి మనసు ఆనందంతో పొంగిపోయింది. వాడిపేరు కూడా అక్కడి గుడిలోని దేవుడి పేరు, అంటే–శివశం కరుడు కావడం తలుచుకోవడంతో ఆ ఆనందం రెట్టింపయింది!

"ఆహా! సాధువు చాలాధైర్యవంతుడు!" అన్నారు మిత్రులు ఒక్కసారిగా చప్పట్లు కొడుతూ. మిత్రుల దగ్గరికి వచ్చిన శివశం కరుడు, "నేనూ ఆంబోతు పక్కగా నడుస్తాను. దానిని కిక్కురుమనకుండా చేస్తాను," అన్నాడు.

"వద్దు! అలాంటి పని చెయ్యొద్దు," అన్నారు మిత్రులు.

వాళ్ళ హెచ్చరికను పట్టించుకోకుండా, ఆంబోతును అదుపుచేసే రహస్యం తెలిసి పోయింది అన్న ధీమా కొద్దీ శివశంకరుడు అమితోత్సాహంతో వెళ్ళి ఆంబోతును సమీ పిస్తూ మెల్లగా, "నేను! నేను!" అన్నాడు. వాడిపేరు కూడా శివశంకరుడు కదా అందు కని అలా అన్నాడు!

ఆంబోతు ముందెన్నడూ లేనంతగా రెచ్చి పోయి, బుసలు కొడుతూ వాడిమీదికి ఉరక బోయింది. హడలిపోయిన శివశంకరుడు ప్రాణభయంతో ఎటు వెళ్ళాలో తెలియక పరుగులంకించుకుని, కాలికి ఏదో బలంగా అడ్డు తగలడంతో కిందపడి, దొర్లుకుంటూ వెళ్ళి పొదలమాటున పడ్డాడు.

దూరంగా వెళుతూన్న సాధువు, అలికిడి విని తిరిగిచూసి, వేగంగా వచ్చి కుర్రాణ్ణి లేవనెత్తాడు. అంతలో వాడి మిత్రులు కూడా పరిగెత్తుకుంటూ వచ్చారు.

శివశంకరుడు కళ్ళనీళ్ళ పర్యంత మయ్యాడు. అంతకుమించి–పొరబాటు ఎక్కడ జరిగింది? అన్న అంతుబట్టని ఆశ్చర్యం వాడి మనసును పీడించ సాగింది.



# ప్రాణమిత్రుడు!

గవరయ్యా, గోపయ్యా పొరుగు గ్రామానికి వెళ్ళి వాళ్ళపనులేవో చూసుకుని, తిరిగి తమ గ్రామంకేసి బయలుదేరారు. గోపయ్యకు లేని గొప్పలు చెప్పుకునే అలవాటుంది. వాళ్ళు గ్రామంలో ఒక వీధి గుండా పోతూండగా, కొంచెందూరంలో ఎదురుగా జోడు గుర్రాలు జోడించిన బండి ఒకటి రావడం కనిపించింది.

దాన్నిచూస్తూనే గోపయ్య, "పెద్దచిక్కే వచ్చింది! ఆ బండీలో వస్తున్నాయన, కృష్ణంరాజు, చిన్నతనంలో మేమిద్దరం గోలికాయలఆట నుంచి కర్రా, కత్తిసాములు కలిసే నేర్చుకున్నాం. ఇప్పుడు నేనాయన కంటబడ్డానంటే, ఒక పట్టాన వదలడు. ఇంటికి తీసుకుపోయి భోజనాలయ్యాక, తీరిగ్గా కూర్చోబెట్టి, అలనాటి చిన్ననాటి కబుర్లతో ముంచెత్తుతాడు. నాకవతల ఇంటి దగ్గిర బోలెడుపనులాయె! నేను ఆయన కంట బడకుండా, ఈ కనబడే భవనం ప్రహరీగోడవెనక దాక్కుంటాను," అంటూ ప్రాంగణంలోపలికి పోయి గోడపక్కగా నిలబడ్డాడు.

అంతలో జోడు గుర్రాల బండి అక్కడికి రానే వచ్చింది. బండిలోంచి చలవబట్టలు కట్టి, కిర్రు చెప్పులతో, చేత పొన్ను కర్రతో దిగిన ఒక శ్రీమంతుడు, గోపయ్యను చూస్తూనే, అంతదూరంలో వున్న నౌకరును కేకవేసి పిలిచి, "ఈ ముచ్చుముఖం బికారీ వెధవ ఎవడు? నాలుగు బాది వీధిలోకి తరిమెయ్యి!" అన్నాడు కోపంగా.

నౌకరు తనను సమీపించేలోపలే గోపయ్య అక్కడినుంచి పరుగులు తీస్తూ, దూరంగా నిలబడి అంతా చూస్తూన్న గవరయ్యను చేరాడు.

"ఏమిటిదంతా, గోపయ్యా? ఆ కృష్ణంరాజు నిన్ను తన్ని తగిలెయ్యమని, నౌకరుతో చెప్పినట్టుందే!" అన్నాడు ఆశ్చర్యంగా గవరయ్య.

"అలాంటిదేంలేదు! అప్పుడప్పుడూ ప్రాణమిత్రులమైన రాజూ, నా మధ్యనడిచే కాస్త మోటు హాస్యం!" అంటూ గోపయ్య పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు.





# స్వర్ణసింహాసనం

(3)

*[దక్షిణాపథాన్నంతటినీ ఏకచ్ఛత్రంగా ఏలిన హైహయ వంశస్థుడైన కౌండిన్య దేశాధిపతి పౌరస్వతుడి పదవతరం వాడు శ్రీదత్తుడు. ఆయన కాలానికి సామంత రాజ్యాలన్నీ విడిపోయాయి. శ్రీదత్తుడు, గురుకులంలో విద్యాభ్యాసం చేస్తూన్న తన ఏకైక కుమారుడు విజయదత్తుణ్ణి రాజధానికి రప్పించి, తమ రాజ్యంలోని నిధినిక్షేపాలను కొల్లగొట్టడానికి పొరుగు రాజులు చేస్తూన్న కుట్రను గురించి చెప్పాడు. ముఖ్యంగా తమ బంధువైన కాళింది ప్రభువు మాధవ సేనుడి ఐశ్వర్య వాంఛను గ్రహించి, చంపక రాజ్యాధిపతి మరాళుడు అతన్ని కుట్రలో భాగస్వామిని చేసుకున్న తీరును వివరించాడు. రాజగురువు శివానందుల సలహా ప్రకారం నగరానికి తూర్పుదిశగా వున్న మైదానంలో తవ్వకాలు జరపడానికి నిర్ణయించారు. మాధవ సేనుడి కుమార్తె శ్రీలేఖ పురుష వేషంలో అక్కడికి వచ్చింది. శ్రీదత్తుడు అప్పటికప్పుడే విజయదత్తుడికీ, శ్రీలేఖకూ గాంధర్వవివాహం జరిపించాడు. - తరవాత]*

ఇక్కడ విజయదత్తుడు, శ్రీలేఖా పాణిగ్రహణం చేస్తూన్న సంతోష సమయంలో, అక్కడ కాళింది దేశంలో, శ్రీలేఖ తండ్రి మాధవ సేనుడు దిక్కుతోచని వాడిలా నిస్సహాయంగా కూర్చునివున్నాడు.

మరొక భవంతిలో చంపక ప్రభువు మరాళభూపతి, అతడి కుమారుడు చక్రభూపతి ఆకలిగొన్న సింహాల్లా కూర్చుని వున్నారు. ఆ రోజు జ్యేష్ఠశుద్ధ ఏకాదశి. శ్రీలేఖా, చక్రభూపతుల నిశ్చితార్థానికై నిర్ణయించిన ముహూర్తపు రోజు. అంతకు రెండు రోజులు ముందుగానే మరాళ, చక్రభూపతులు కొంత సైన్యాన్ని వెంటబెట్టుకుని కాళింది దేశానికి వచ్చారు. జ్యేష్ఠశుద్ధ ఏకాదశి నాడు నిశ్చితార్థం చేసుకుని, బహుళ దశమిదాకా కాళిందిలో గడిపి, ఆనాటి రాత్రి ససైన్యంగా కౌండిన్య మీదికి దండెత్తడమనేది, మరాళ, మాధవ సేనులు నిర్ణయించుకున్న పథకం. నాలుగు నెలల

లక్ష్మీగాయత్రి



క్రితం రథోత్సవానికి మాధవ సేనుడు వెళ్ళినప్పుడు జరిగిన మాటల్లోనే, ఆ పథకం తయారుచేయబడింది.

ఆనాడు అంతా తిరుగులేని విధంగా నిర్ణయించిన మరాళభూపతి, మాధవ సేనుడితో, "మిత్రమా, మీరు అన్యధా భావించక, ఈ విషయాలన్నీ అంతఃపుర స్త్రీలనుంచి మాత్రం గోప్యంగా వుంచండి. ఎంత మహారాణి అయినప్పటికీ స్త్రీ స్త్రీయే. ఆడవారి నోట్లో నువ్వుగింజ నానదంటారు. ఇటువంటివన్నీ వాళ్ళకు తెలియజెప్పటం మనకు చాలా ప్రమాదం," అన్నాడు.

అప్పటికే మరాళుడి మాటలకు బాగా సమ్మోహితుడైవున్న మాధవ సేనుడికి, ఆ మాటలు సబబుగానే అనిపించాయి తప్ప, తన కుమార్తెకు మాట మాత్రం చెప్పకుండా, ఆమెకు వరుణ్ణి నిశ్చయించి, నిశ్చితార్థపు పీటలమీదికి తీసుకు పోవటమనేది అన్యాయంగా తోచలేదు. మరాళుడు వధువు ఇష్టాయిష్టాలతో ప్రమేయంలేకుండా ప్రవర్తిస్తున్నాడన్న ఆలోచనా రాలేదు. అందువల్ల, అతడు భార్యాబిడ్డలకు ఏ విషయమూ తెలియ నివ్వలేదు.

అయితే, కాళింది మహారాణి అయిన వసుమతిగురించి, మరాళ, మాధవసేను లిద్దరూ చాలా తక్కువ అంచనావేశారు. మేధావీ, యుద్ధనీతులు తెలిసినదయిన వసుమతి, ఎదిరి మనసును చక్కగా గ్రహించగల సమర్థురాలు. రథోత్సవంలో చంపక ప్రభువు, తన భర్తకిస్తున్న మర్యాదా, గౌరవమూ కాస్త అతిగా కనిపించాయామెకు. రథోత్సవం నుంచి తిరిగివచ్చిన నాటినుంచి, ఏదో అనుమానంతో భర్తను మరింత సూక్ష్మంగా గమనించటం ప్రారంభించిన ఆమెకు-తన పుట్టినింటి పట్ల భర్త తీరుతెన్నుల్లో స్పష్టమైన తేడా కనిపించింది. దానితో వ్యధ చెందిన వసుమతి, తనకు తానుగా కొంతమంది వేగులను ఏర్పాటు చేసుకుని, మొత్తం గ్రహించింది. పరిస్థితి తన చేయిదాటిపోయిందని అర్థం చేసుకున్న ఆమె, అంతా వివరంగా కూతురు శ్రీలేఖకు చెప్పి, నమ్మకస్తురాలైన ఒక చెలికత్తె సహాయంతో ఆమెను అన్న దగ్గరకు పంపివేసింది. నిశ్చితార్థపు రోజు ఉదయం వరకూ రాకుమారి అదృశ్యం గురించి బైటికి పొక్కకుండా జాగ్రత్త పడిన ఆమె, అప్పుడే తనకూ తెలిసినట్టు నటించింది.

కూతురు అదృశ్యమైందని విన్న మాధవసేనుడు, మతి చలించినవాడిలా అయ్యాడు. అతడికి తనకు లభించబోయే ఐశ్వర్యమూ, దక్షిణాపథ సార్వభౌమత్వమూ కూడా, కూతురితో బాటే అదృశ్యమైనట్టు అనిపించ సాగింది. శ్రీలేఖ కౌండిన్య దేశానికే పారిపోయివుంటుందని అతడు గ్రహించాడు. ఈ విషయం తెలిస్తే మరాళుడు కూడా, ఆమె ఎక్కడికి వెళ్ళిందో ఊహించగలడని కూడా అతడికి అర్థమైంది.

ఇటు మరాళభూపతికి శ్రీలేఖ అదృశ్యమైన వార్తతోబాటు, వేగులు అంత క్రితమే తెచ్చిన మరొక వార్త కూడా శరాఘాతంలా తగిలింది, అది విజయదత్తుడు గురుకులం నుంచి శిక్షణ పూర్తికాకుండానే, తండ్రి పిలుపునందుకుని స్వదేశానికి తిరిగివచ్చాడన్న వార్త. విజయదత్తుడు లేని సమయంలో, కౌండిన్యను ముట్టడించాలని పథకంవేసిన మరాళుడు, వేగులు తెచ్చిన వార్తతో హతాశుడై, "ఛీ, ఛీ, హఠాత్తుగా దండెత్తిపోవలసింది. కొద్దిపాటి అజాగ్రత్తవల్ల అనవసరపు టాలస్యం చేశాను," అని తనను తాను తిట్టుకున్నాడు.

చివరకు, ఆయనా, కొడుకు భూపతీ కలిసి బాగా ఆలోచించి, జరిగిందేదో జరిగిపోయిందనీ, మిగిలిన సైన్యాన్ని వెంటనే బయలుదేరవలసిందిగా కబురుపంపి, బహుళ దశమికి బదులు, బహుళ పంచమి నాడే దండయాత్రకు బయలుదేరాలని, మాధవసేనుడికి వార్తపంపారు.



ఆ వార్తనందుకున్న మాధవసేనుడు, మరీ ధర్మసంకటంలో పడ్డాడు. నిన్న మొన్నటిదాకా శ్రీదత్తుడు తనకు కేవలం బావమరిది. కానీ, ఈనాడు తన కూతురు వారితో బాంధవ్యాన్ని కోరుకుని వెళ్ళి, తనను మరింత చిక్కులో పెట్టింది. ఈక్షణాన మరాళుడికీ, అతడి కొడుక్కూ, శ్రీలేఖ పట్లా, తనపట్లా ఎటువంటి క్రోధమూ లేదనేది నమ్మలేనివిషయం. ఇంతవరకూ వచ్చిన యుద్ధవ్యూహాన్ని పాడుచెయ్యలేకా, తనెక్కడ తిరిగి శ్రీదత్తుడితో మైత్రికలుపుతాడోననే భయం చేతా, మరాళుడు తనతో ఇంకా పొత్తు సాగిస్తున్నాడు, అంతే! తన సహాయంతో శ్రీదత్త విజయదత్తులిద్దర్నీ ఓడించటమంటూ జరిగితే, ఇక మరాళుడికి తన అవసరం వుండదు సరికదా, తనమీద



పగతీర్చుకునే సావకాశంకూడా దొరుకుతుంది. ఇక అప్పుడు తనకు లభించేది సార్వభౌమత్వమూ, ఐశ్వర్యమూకాదు-కారాగారవాసమూ, శిరశ్ఛేదమూ!

ఇలా ఆలోచించటం ప్రారంభించిన మాధవ సేనుడిలో, నెమ్మదిగా పశ్చాత్తాపం కూడా అంకురించటం ప్రారంభమైంది. ఆసమయంలో అక్కడికి వచ్చిన మహారాణి వసుమతి, భర్తతో ఒక గంట సేపు సానునయంగా మాట్లాడి, అతడి అంతరాంతరాల్లో ఏమూలో వున్న ద్రోహచింతననూ, ఐశ్వర్యకాంక్షనూ పూర్తిగా తుడిచివేసింది. విజయదత్తుడి శౌర్య పరాక్రమాల గురించి వర్ణించి చెప్పి, శత్రువులకు ఎట్టిపరిస్థితుల్లోనూ ఓటమి తప్పదనీ, దక్షిణాపథ సార్వభౌమత్వం చేజిక్కించుకునే సామర్థ్యం విజయదత్తుడికేగాని, చక్రభూపతికి లేదనీ నొక్కిచెప్పింది.

భార్యమాటలతో, మాధవ సేనుడికి భవిష్యత్తుపట్ల కొత్త ఆశలు చిగురించాయి. కాని, చేజేతులా శ్రీదత్త, విజయదత్తులతో వైరం తెచ్చిపెట్టుకున్నానన్న బాధ అతణ్ణి వదలలేదు.

అది గ్రహించిన వసుమతి, "జరిగిన దానికి బాధపడకండి. ఇప్పుడు మించి పోయిందేమీలేదు. 'మేం, మీకు మిత్రులమే గాని, శత్రువులంకాదు. శ్రీలేఖా, విజయ దత్తులకు ఆశీస్సులు!' అని పావురం ద్వారా, మా అన్నయ్యకు రహస్యవార్త పంపండి. తర్వాత, అనుకున్న ముహూర్తానికి మరాళుడితో కలిసి సైన్యంతో వెళ్ళి, యుద్ధంరేపనగా ఈరోజు రాత్రి, మన సైనికులకు రహస్యంగా ఆదేశాలు ఇవ్వండి! ఆ ప్రకారం వాళ్ళు రణరంగంలో, మరాళుడి సేనల్నే నాశనం చేస్తారు. అటు కౌండిన్య సేనలు, ఇటు మన సేనలు ఒక్కసారి విరుచుకుపడితే, ఎంతటి మరాళుడైనా నీరుగారిపోతాడు. మా అన్నయ్య, విజయుడు మొదట్లో కాస్త తికమకపడినా, పరిస్థితి తేలిగ్గా అర్థం చేసుకుంటారు," అని చెప్పింది.

వసుమతి మాటలతో మాధవ సేనుడి మనస్సు తేలికపడింది. అతడు నిట్టూరుస్తూ, "దేవీ, యిన్నాళ్ళూ నీ విలువను గ్రహించలేకపోయాను. మరాళుడు వేసిన ఎరకు ఇట్టే లొంగిపోయాను. నిధి నిక్షేపాలూ, పదవీ వ్యామోహాలకు అతీతమైన బ్రతుకు విలువ, రాచరికపు ధర్మమూ ఈనాడు బాగా తెలిశాయి. నువ్వు చెప్పినట్టే శ్రీదత్తుడికి ఇప్పుడే రహస్యంగా వార్తపంపిస్తాను," అన్నాడు.

ఆ తర్వాత వసుమతి చెప్పిన ప్రకారం, మాధవ సేనుడు పంపిన పెంపుడు పావురం, సూర్యోదయ సమయానికి శ్రీదత్తుడి శయనమందిరపు గవాక్షం దగ్గర చేరి, అదేపనిగా రెక్కలు టపటపలా డించడం ప్రారంభించింది. ఆ అలికిడితో శ్రీదత్తుడు కళ్ళుతెరవగానే, నగిషీలుగా చెక్కిన ఆ గవాక్షపు సందుల్లోంచి లోపలికి దూరి, ఒక్క ఊపున అతడి పక్కన వాలింది.

పావురం ప్రవర్తనను బట్టి, అది శిక్షణపొందిన పావురమని గ్రహించిన శ్రీదత్తుడు దాన్ని నిమిరి, దాని కాలికి కట్టబడివున్న లేఖను తీసుకున్నాడు. అది చదివిన శ్రీదత్తుడికి క్షణకాలం, అది కలో నిజమో అర్థం కాలేదు. తక్షణం కబురుపంపి, శ్రీలేఖ విజయదత్తులను రప్పించిన అతడు, పావురం తెచ్చిన లేఖను కొడుక్కు యిచ్చాడు.

అది చదివిన విజయదత్తుడు చిరునవ్వుతో, దాన్ని శ్రీలేఖకు అందిస్తూ, "ఇటువంటి శుభసమాచారంకోసమే నేను ఎదురుచూస్తున్నాను, నాన్నా! శ్రీలేఖ యిక్కడికి రావటం, మామయ్యలో మార్పుకు కారణం కావచ్చునని, నేను ఆశపడుతూనే వున్నాను," అన్నాడు.

శ్రీదత్తుడు చాలా ఆనందంగా, "విజయా, ఇది మనకు కలిగిన రెండవ శుభం! ఇక కొద్ది గంటల్లో ప్రారంభం కాబోయే తవ్వకాలు మరెంతటి శుభాన్ని తెస్తాయో, చూద్దాం!" అన్నాడు.

ఆసరికి బాగాతెల్లవారింది. మరొక గంట తర్వాత, రాజగురువు శివానందుల



ఆధ్వర్యంలో, నగరపు తూర్పు దిక్కున తవ్వకాలు ప్రారంభమవుతాయి.

త్వరత్వరగా ప్రాతఃకాల విధులు పూర్తిచేసుకున్న మహారాజు, శ్రీలేఖా విజయదత్తులతో కలిసి, స్వయంగా తవ్వకాలు జరుగుతున్న చోటుకు బయలుదేరారు.

ఖాళీగా వున్న తూర్పు వైపు మైదానంలో, శివానందులు వలయాకారంలో గుర్తించి, మంత్రజలం చల్లినంత మేరా దాదాపు అరవైమంది కూలీలు, చురుగ్గా తవ్వుతున్నారు. ఆ తవ్వకాలు అలా మధ్యాహ్నం దాకాసాగి, మధ్యాహ్నానికి పది, పన్నెండు అడుగులలోతుకు భూమి తవ్వబడింది.

మధ్యాహ్నం భోజనానికి కూలీలు లేవగానే, మహారాజు కూడా కొడుకు, కోడలితో కలిసి రాజభవనానికి తిరిగి వచ్చాడు.



ముగ్గురూ భోజనం చేసి విశ్రాంతిగా కూర్చున్న ఒక గంటకే మహారాజును, యువరాజును రాజగురువులు రమ్మంటున్నారంటూ భటుడు వార్తతెచ్చాడు.

మహారాజు వెంటనే కొడుకుతో సహా హుటాహుటిని బైలుదేరి మైదానాన్ని చేరుకుని, గోతి అంచున నిలబడివున్న శివానందులను సమీపిస్తూనే గోతిలోకి చూసి, ఆశ్చర్యంతో స్తంభించిపోయాడు.

అప్పటికి పదమూడు అడుగుల లోతుకు తవ్వబడివున్న ఆ గోతిలో, సుమారు పది హేను, పదహారు అడుగుల పొడవువున్న ఒక నల్లని మహాసర్పం, పూర్తిగా పడగవిప్పి, చుట్టలు చుట్టుకుని, నిశ్చలంగా ఒక మహాసర్పాకృతిలావున్నది. రాజగురువు శివానందులతో సహా, కూలీలందరూ గోతి అంచున వలయాకారంలో నిలబడి, సర్పాన్ని అబ్బురంగా చూస్తున్నారు.

శ్రీదత్త, విజయదత్తులిద్దరూ తనను సమీపించగానే శివానందుడు, తృప్తి నిండిన కంఠంతో, "మహారాజా, ధ్యానంలో వుండగా నా కళ్ళముందు కనిపించిన మహాసర్పం ఇదే! భూగర్భంలో అపూర్వమైన నిధిని నిక్షిప్తంచేసిన వ్యక్తి, మంత్ర శాస్త్రజ్ఞుల సహాయంతో ఒక మంత్ర భుజంగాన్ని సృష్టించి, తనునిక్షిప్తపరచిన దానికి కాపలాగాపెట్టటమనేది, పూర్వపు రోజుల్లో ఒకనియమంగా వుండేది. ఆ మంత్రబద్ధ భుజంగం, తనను సృష్టించిన మంత్రవేత్త ఆజ్ఞలకు లోబడి వుంటుంది. ఇప్పుడు మనకు కనిపిస్తున్న ఈమహాసర్పంకూడా అటువంటిదే!

"భోజనాలు ముగించిన తర్వాత కూలీలు, ఒక్క అడుగైనా పూర్తిగా తవ్వారో లేదో, లోపలి పొరల్లోంచి అత్యంత వేగంగా దూసుకువచ్చిన ఈ సర్పం, తన చుట్టూ నాలుగైదడుగుల మేరకు, బుస్సుమంటూ వేడి గాలులు చిమ్మటం ప్రారంభించింది! భరింప శక్యంకాని ఆ వేడికి, మేమంతా గట్టు ఎక్కి దూరంగా నిలబడ్డాం. ఇదేదో మంత్రబద్ధమైన సర్పమని అనుమానించిన నేను, ఆ విషయం రూఢి చేసుకుందామని, స్వయంగా గోతిలోకి దిగి దాన్ని సమీపించబోయాను. అది మళ్ళీ పడగవిసురుతూ బుస్సున వేడిగాలులు చిమ్మటం ప్రారంభించింది. ఇక సందేహంలేదని వెంటనే మీకు కబురుచేశాను," అన్నాడు.

శ్రీదత్తుడు ఆశ్చర్యంగా సర్పంకేసి చూస్తూ, "ఇప్పుడుదీన్ని ఇక్కడనుంచి తరిమెయ్యడం ఎలా?" అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు శివానందుడు సాలోచనగా, "మంత్రబద్ధమైన మహాసర్పాలు, సాధారణంగా ఉచ్చాటనా మంత్రాలు పఠించగానే అదృశ్యమవుతాయి. కాని, ఆ సర్పం ఏనిధికైతే కాపలాగా వుందో, ఆనిధి ఒక ప్రత్యేక వ్యక్తికోసం అయితే మాత్రం, సర్పాన్ని కదిలించటందాదాపు అసాధ్యం. ఆవ్యక్తికి తప్ప అది మరే శక్తికీ లొంగదు! ప్రస్తుతానికి మన ప్రయత్నం మనం చేద్దాం. ఇప్పటివరకూ మనకు అనుకూలించిన ఆ దైవం, ఇప్పుడు కూడా మనకు విజయం చేకూరుస్తాడనే ఆశిద్దాం," అంటూ మహారాజు అనుమతి కోస మన్నట్టుగా ఆగాడు.

"సరే, కానివ్వండి!" అన్నాడు మహారాజు.

శివానందుడు వెంటనే తనతో బాటు తెచ్చిన కమండలంలోని నీటిని చేతిలోకి తీసుకోబోతూ, విజయదత్తుడితో, "నాయనా, ఒకసారి సర్పంతో తలపడట మంటూ ప్రారంభించాక, ఎటువంటి విచిత్ర పరిస్థితులైనా ఎదురుకావచ్చు, సిద్ధంగా వుండు" అన్నాడు.

ఆ మాటవినగానే విజయదత్తుడి చేయి, అప్రయత్నంగా ఒరనున్న ఖడ్గం పై బడింది. శ్రీదత్త, విజయదత్తులతో సహా అందరూ నివ్వెరపోతూ చూస్తూండగా, శివానందుడు గోతిలోకి దిగి, ఉచ్ఛస్వరంతో మంత్రాలు పఠిస్తూ చేతిలోని మంత్ర జలాన్ని సర్పం పై చిలకరించాడు. సర్పం మాయంకాలేదుగాని, వేడిగాలులు చిమ్మటం మాత్రం ఆపింది. తన మంత్రా లకు సర్పం మాయంకాకపోవటంతో, మళ్ళీ మంత్రజలాన్ని అందుకో బోయాడు, శివానందుడు.

అంతలో, ఆ సర్పం "ఓ మంత్రవేత్తా! నేనొక మహత్కార్యంకోసం సృష్టించ బడిన సర్పాన్ని! నన్ను సృష్టించిన మంత్ర తంత్ర ప్రావీణ్యుడు, నాకొక ప్రశ్న, దానికి సమాధానమూ చెప్పాడు.నేనుఅడగ బోయే ఆ ప్రశ్నకు, ఆ సమాధానం చెప్పిన వ్యక్తికే నేను లొంగుతానుతప్ప, ఉచ్చాట నాది మహామంత్రాలు వేటికీ లొంగను," అన్నది.

ఆ మాటలు వినగానే శ్రీదత్త, విజయ దత్తులిద్దరూ ముఖముఖాలు చూసు కున్నారు. శివానందుడు మారుమాట్లాడక వెనుదిరిగివచ్చి, విజయదత్తుడితో, "నాయనా, ఇప్పుడిక నీవంతు వచ్చింది. నిర్భయంగా ముందుకు వెళ్ళి సర్పం అడగబోయే దానికి జవాబు చెప్పు," అన్నాడు.

-(ఇంకావుంది)





# భారతసం...

*ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు–*
*తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!*

## 2. వర్షం కురిసిన రాత్రి...

దేవనాధుడు తన గదిలో కూర్చుని చదువుకుంటూండగా ఏదో చప్పుడై తల పైకెత్తాడు. సందీపుడు తన చెల్లెలు శ్యామలతో లోపలికి వస్తూ, "ఈ గడుసు పిల్ల, ఆర్యులు మనదేశంపై దండెత్తి రాలేదని నిరూపించగలవా? అని సవాలు చేస్తోంది, తాతయ్యా!" అన్నాడు.

దేవనాధుడు చదువుతూన్న పుస్తకం మూసి పక్కన పెట్టి కొంత సేపు మౌనంగా ఊరుకుని, "సందీపా! మరి, శ్యామలను హొనొలూలూ నుంచో, మడగాస్కర్ నుంచో రాలేదని నిరూపించమని నువ్వు అడగలేక పోయావా?" అని అడిగాడు.

"అదెలా అడగగలను తాతయ్యా? ఆ అమ్మాయి నాతో పాటు ఇక్కడే ఉన్నది. మేమిద్దరంఒకేఇంట్లోఉంటున్నాం కదా?" అన్నాడు సందీపుడు.

"అలా చెప్పావు, బావుంది. మీరు ఈ ఇంటికి చెందిన వాళ్ళు కారనీ, హొనొలూలూ నుంచో, మడగాస్కర్ నుంచో వచ్చిన వారనీ నేను చెప్పాననుకోండి. అప్పుడు దానిని నిరూపించడం, రుజువు చేయడం లాంటివి కావాలి. అంతే కదా?" అన్నాడు దేవనాధుడు.

"అవును!" అన్నాడు సందీపుడు.

"భారతీయుల విషయంలోనూ అంతే. వారు అనాది కాలం నుంచి ఇక్కడే ఉన్నారు. హిమాలయాలకు ఆవలినుంచి వచ్చిన వారని చెప్పడానికి ఎలాంటి ఆధారాలూ లేవు. భారతీయ సాహిత్యమే ప్రపంచ సాహిత్యంలో ప్రాచీనమైనది. అందులో ఏ ఒక్కచోట కూడా వాళ్ళు వదిలిపెట్టివచ్చిన, స్వస్థలం గురించిన ప్రస్తావన లేదు. ఆ విషయాన్ని సూచించే పురాణ కథలు గాని, సంప్రదాయం గాని, చారిత్రక విశేషాలు గాని మచ్చుకు కూడా కనిపించవు. చెప్పాలంటే మన పూర్వులే ఇక్కడి నుంచి దూరతీరాలకు వెళ్ళి మన సంస్కృతీ సంప్రదాయాలతో అక్కడి నాగరికతలను ప్రభావితం చేసి వచ్చారని చెప్పే ఆధారాలు కోకొల్లలుగా ఉన్నాయి!" అన్నాడు దేవనాధుడు.

"తాతయ్యా, మరి ఆర్యులు దూర దేశాలనుంచి మనదేశానికి వచ్చారనే సిద్ధాంతం మన మధ్య ఎలా పాతుకు పోయిందంటారు?" అని అడిగాడు సందీపుడు అనుమానంగా.

"మంచి ప్రశ్న అడిగావు. మనల్ని పాలించిన బ్రిటిష్ వాళ్ళు, ఈ సిద్ధాంతాన్ని కల్పించారు. భారతీయులలో అధిక సంఖ్యాకులు ఒకానొకప్పుడు దూర దేశాల నుంచి ఇక్కడికి వచ్చి స్థిరపడినవాళ్ళే గనక; దూరతీరాల నుంచి వచ్చిన తాము కూడా వాళ్ళ మీద అధికారం చెలాయించడంలో అసహజంగానీ, అన్యాయం గానీ లేదు, అన్న భావాన్ని ప్రజలలో ఏర్పరచడం వాళ్ళ ఉద్దేశం కావచ్చు. ఇక్కడ వేదన కలిగించే విషయం ఏమిటంటే–మన





చరిత్రకారులెవరూ ఆ సిద్ధాంతంలోని నిజానిజాలను నిలదీసి నిగ్గుతేల్చలేదు. అలాగే అంగీకరించారు!" అన్నాడు దేవనాధుడు విచారంగా.

అంతలో కొందరు మిత్రులు సందీపుణ్ణి వెతుక్కుంటూ వచ్చారు. పాఠశాలలో వార్షికోత్సవం కోసం ఏర్పాట్లు జరుగుతున్నాయి. వాటి విషయంగా ఉపాధ్యాయులతో మాట్లాడడానికి మిత్రులు సందీపుణ్ణి కూడా రమ్మని పిలిచారు. సందీపుడు తాతయ్య దగ్గర అనుమతి తీసుకుని వాళ్ళతో వెళ్ళాడు.

"తాతయ్యా! మీరు నిన్న సందీపుడికి నచికేతుడికథ చెప్పారట. అన్నయ్య దాన్ని నాకు చెప్పి గొప్పలు పోయాడు. అలాంటి పాతకథ ఒకటి నాకిప్పుడు చెప్పండి. అన్నయ్య రాగానే నేను చెబుతాను," అన్నది శ్యామల.

"అలాగే చెబుతానమ్మా! రా, కూర్చో. పూర్వకాలంలో గురు శిష్యుల మధ్య సంబంధం ఎలాంటిదో తెలియజెప్పే కథ ఇది. మరొక విషయం ఏమంటే ఇది కేవలం కథ కాదు. మునుముందు గొప్ప మునిగా పేరు గాంచిన ఒక విద్యార్థి జీవితంలో జరిగిన సంఘటన!" అంటూ దేవనాధుడు ఇలా చెప్పసాగాడు:

"ఒక అందమైన లోయలో ధౌమ్యముని ఆశ్రమం ఉండేది. ఆశ్రమానికి వెనక ఎత్తయిన కొండలూ, ఎదుట చిన్న అడవీ ఉండేవి. ధౌమ్యుడి ఆశ్రమంలో ప్రధాన భాగం ఆయన నడిపే గురుకులం. ధౌమ్యుడు గొప్ప గురువుగా పేరుగాంచడం వల్ల, చుట్టుపక్కల నుంచి చాలామంది విద్యార్థులు వచ్చి, ఆ గురుకులంలో చదువుకునేవాళ్ళు. కొందరు యోగాభ్యాసం చేసేవాళ్ళు," అని ఆగాడు దేవనాధుడు.

"యోగాభ్యాసం అంటే ఏమిటి తాతయ్యా?" అని అడిగింది శ్యామల.

"యోగం గురించిన విషయాలను మీ అన్నయ్య వచ్చాక, ఇద్దరికీ కలిపి ఒకేసారి చెబుతాను," అన్నాడు దేవనాధుడు.

"సరే, ఇప్పుడు కథ చెప్పండి తాతయ్యా!" అన్నది శ్యామల.

"ధౌమ్యుడు నడిపే గురుకులానికి ఒకవైపున చిన్న చెరువూ, చెరువు కింద పొలమూ ఉండేవి. ఆశ్రమంలోని వారే ఆ





పొలంలో కష్టపడి పనిచేసి, తమకు కావలసిన ధాన్యం పండించుకునేవారు.

ఒకరోజు కుండపోతగా వాన ఆరంభ మయింది. మర్నాటికి కూడా తగ్గలేదు. సాయంకాలానికి కూడా జడివాన తగ్గుముఖం పట్టకపోయేసరికి, గురువు తన శిష్యుల మధ్య కూర్చుని, "కుంభవృష్టిగా వుంది. చెరువుకట్ట



తెగి పంటపొలం మునిగిపోతుందో ఏమో!" అన్నాడు విచారంగా.

ఆ మాట ఆరుణి చెవిలో పడింది. గురు కులంలో చదువు పూర్తిచేసి, స్వస్థలానికి వెళ్ళడానికి గురువు అనుమతి కోసం ఎదురు చూస్తూన్న చురుకైన విద్యార్థి ఆరుణి. అతడు వేదవేదాంగాలనూ, పురాణాలనూ వివరించగలడు. వేదాంత అర్థాలను విడమరచి చెప్పగలడు. యోగవిద్యను కూడా అభ్యసించాడు.

గురువు మనసులోని భావాన్ని పసిగట్టిన ఆరుణి అప్పటికప్పుడే చెరువు కట్టకేసి బయలుదేరాడు. వాన కొంచెం తగ్గింది. కారుమేఘాల చాటునుంచి వెన్నెల మసక మసకగా ప్రసరిస్తోంది. ఆరుణి వేగంగా వెళ్ళి కట్టను చేరుకున్నాడు.

చెరువుకట్టకు ఒకచోట గండిపడి నీళ్ళు పంటపొలం మీదికి ఉరుకుతున్నాయి. ఆరుణి పక్కనున్న రాళ్ళను, మట్టినీ చేత్తో తీసి గండికి అడ్డుగా వేశాడు. నీటి వేగం తగ్గలేదు సరికదా, క్షణం క్షణం పెరుగు తోంది. ఆరుణి తీవ్రంగా ఆలోచించి, ఒక్క ఉదుటున వెళ్ళి గండికి అడ్డంగా పడు కున్నాడు. నీళ్ళు వెళ్ళడం క్రమంగా ఆగి పోయింది.

మళ్ళీ మబ్బులు దట్టంగా కమ్ముకుని గాలివాన ఆరంభమయింది. మరోవైపు చెరువులో నుంచి నీటి అలల తాకిడి. భయంకరమైన చలి, అయినా ఆరుణి పడుకున్న చోటు నుంచి అటూ ఇటూ కదలలేదు. అన్నీ భరిస్తూ అలాగే ఉండి పోయాడు. అర్ధరాత్రి దాటాక స్పృహ కోల్పోయాడు.

రాత్రి వెళ్ళిన ఆరుణి ఇంకారాలేదేమిటి అన్న ఆతృతతో గురువు తెల్లవారకముందే కొందరు శిష్యులను వెంటబెట్టు కుని చెరువు దగ్గరికి వెళ్ళాడు. గట్టుతో పాటు గట్టుగా స్పృహతప్పి పడివున్న ఆరుణిని పైకెత్తి, పక్కన పడుకోబెట్టారు. కొందరు శిష్యులు



గట్టును బాగు చేశారు. మరికొందరు శిష్యులూ, గురువూ ఆరుణిని ఆశ్రమానికి మోసుకువెళ్ళి, ఉపచారాలు చేసి స్పృహ తెప్పించారు. ఆరుణి కోలుకుని మామూలు మనిషి అయ్యాక, గురువు అతన్ని దగ్గరికి పిలిచి, "నాయనా! ఈనాటితో నీ విద్య పూర్త యింది. ఇక నువ్వు ఇంటికి వెళ్ళవచ్చు!" అన్నాడు ఆప్యాయంగా.

ఆరుణి కృతజ్ఞతతో నమస్కరించాడు.

దేవనాథుడు కథను పూర్తిచేయగానే, "గొప్పసాహసం! తాతయ్యా," అన్నది శ్యామల ఆశ్చర్యంగా.

"ఆరుణిలోని సాహసాన్నీ, ఉదాత్త గుణాన్నీ గ్రహించావు, చాలా సంతోషం. ఇక్కడ గమనించవలసిన ముఖ్యవిషయం ఏమంటే–గురువు పెట్టిన పరీక్షకు సమాధానం ఆచరణలో చేసి చూపి నెగ్గాడు ఆరుణి. అతడు గొప్ప పండితుడు. అయినా, అవసరమైనప్పుడు కష్టమైన శరీరశ్రమకు వెనుకాడలేదు. తన లక్ష్యాన్ని సాధించడంలో, అంటే పంట పొలాన్ని కాపాడ్డంలో అతడు చూపిన పట్టుదల అచంచలమైనది. ఆదర్శం–ఆచరణ ఈ రెండింటికీ సమానమైన ప్రాముఖ్యతనిచ్చేదీ; మనిషిలోని అహంకారాన్ని పోగొట్టి త్యాగగుణాన్ని పెంచేదే నిజమైన విద్య. తాను చేసిన ఒక్కపనితో ఆరుణి ఆ గుణాలన్నింటినీ సాధించినట్టు చక్కగా నిరూపించాడు. అర్థమయిందా?" అన్నాడు దేవనాథుడు.

"అర్థమయింది, తాతయ్యా! నేనిప్పుడే వెళ్ళి అన్నయ్యకు ఈ కథ చెబుతాను," అంటూ లేచి నిలబడింది శ్యామల ఎంతో ఉత్సాహంగా.

"కథను అన్నయ్యకు చెప్పడం మాత్రమే కాదు. ఆరుణి కనబరచిన మంచి గుణాలను మీరందరూ అలవరచుకోవడానికి ప్రయత్నించాలి. తెలిసిందా?" అన్నాడు దేవనాథుడు.

"అలాగే, తాతయ్యా!" అన్నది శ్యామల సంతోషంగా. — (ఇంకాఉంది)



# బద్ధకస్థుడు

కుందవరం అనే గ్రామంలో పాపయ్య అనే, ఒక చిన్న వ్యవసాయదారుడుండేవాడు. అతడికి నలభైయ్యో ఏట భార్యపోయింది. పెళ్ళీడుకొచ్చిన ఇద్దరు కూతుళ్ళకూ, గ్రామంలోనే కాస్త తన తాహతుకు మించినవాళ్ళకు కట్నకానుకలిచ్చి పెళ్ళిచేయడంతో, ఉన్న రెండెకరాల పొలం హరించుకుపోయింది.

ఇక గత్యంతరంలేక పాపయ్య బతుకుతెరువుకు, కూలిపనులకు వెళ్ళసాగాడు. కాస్త వయసు మీరడంవల్లా, అంతకు మించి స్వతహాగా బద్ధకస్థుడు కావడంవల్లా, తెలిసిన వాళ్ళెవరూ అతణ్ణి కూలిపనులకు తప్పనిసరైతే తప్ప పిలిచేవాళ్ళుకాదు. అతనికి క్రమంగా ఒక్కొక్కపూట పస్తులుండవలసిన పరిస్థితి ఎదురైంది.

సంగతి తెలిసిన కూతుళ్ళిద్దరూ, పాపయ్యను తమ ఇళ్ళకొచ్చి వుండమన్నారు. పాపయ్య అల్లుళ్ళ ఇంట చేరడం అవమానం అనిపించి, ససేమిరా రాననేశాడు. దానితో కూతుళ్ళే అతడికి రెండుపూటలా భోజనం తెచ్చిపెడుతూండేవాళ్ళు. ఇలా వుండగా—ఒకనాటి రాత్రి దొంగ ఒకడు అతడి ఇంట దూరి, దొంగిలించేందుకు ఏమీలేకపోవడంతో, "ఛీ, ఛీ ఏం కొంప!" అనుకుంటూ, ఇంటి తలుపును బార్లాతెరచి బయటకు వెళ్ళబోయాడు.

ఆ శబ్దానికి మెలుకువ వచ్చిన పాపయ్య, దొంగను చూసి, "ఒరేబాబూ! తలుపుమూసిపో," అన్నాడు పెద్దగా ఆవులిస్తూ.

అది విన్న దొంగ కోపంగా, "ఎన్నిళ్ళల్లోనో దొంగతనాలు చేశాగాని, ఏ ఇంటా నీ అంత బద్ధకస్థుణ్ణి చూడలేదు. అందువల్లే, కటికదరిద్రం అనుభవిస్తున్నావు," అన్నాడు.

పాపయ్య మంచంమీద లేచికూర్చుని, "అవును బద్ధకస్థుణ్ణే! కష్టించి కూడబెట్టినా, నీబోటి దొంగవెధవల పాలవుతుందిగా," అన్నాడు విసుగ్గా.





# ఆటలో ఆనందం

సువర్ణగిరిని పాలించే రత్నపాలుడికి చదరంగం అంటే చాలా ఆసక్తి. ప్రతిరోజూ క్షణం తీరిక లేకుండా రాచకార్యాల్లో మునిగి తేలుతున్నా, ఏ కొద్ది విశ్రాంతి సమయం దొరికినా, ఆయనకు మంత్రి సుధాముడితో చదరంగం ఆడటం అలవాటు. సుధాముడితోనే కాక, అప్పుడప్పుడూ మహారాణి వినీలాదేవితోనూ, సేనాపతి సూరవర్మతోనూ ఆడుతూండే వాడు. ఎవరితో ఆడినా గెలుపు రత్నపాలుడిదే. ఆ గెలుపు ఆయనకు మహదానందంగా ఉండేది.

ఇలా వుండగా–ఒకసారి మంత్రి సుధాముడు ఆటలో మహారాజును ఓడించాడు. అంతవరకూ ఓటమి అనేది ఎరగని రత్నపాలుడి ముఖం కోపంతో ఎరుపెక్కింది. పట్టరాని ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ లేచి నిలబడి, చదరంగం బల్లను గట్టిగా ఒక్క తన్ను తన్ని, విసవిస అంతఃపురం వైపు వెళ్ళి పోయాడు. జరిగిన హఠాత్పరిణామానికి మంత్రి సుధాముడు ఆశ్చర్యపోయాడు.

మర్నాడు రత్నపాలుడు, సుధాముడిని పిలిపించి, తన ప్రవర్తనకు నొచ్చుకుని తిరిగి ఆట ప్రారంభించాడు. ఈసారి రత్నపాలుడే గెలిచాడు. ఆయన ముఖం కళకళలాడింది. కానీ తర్వాతి ఆట సుధాముడు గెలిచాడు. రత్నపాలుడు వచ్చిన ఆగ్రహాన్ని నిగ్రహించుకొని, ఏమీ మాట్లాడకుండా అంతఃపురానికి వెళ్ళి పోయాడు.

అది మొదలు ప్రతిరోజూ వరసగా సుధాముడే ఆట గెలిచాడు. ఆ ఓటమిని మహారాజు జీర్ణించుకోలేక పోయాడు. ఆయన ముఖంలో ఆనందం కరువైంది. ఎప్పుడూ విచారంగా వుండసాగాడు. రోజువారీ రాచకార్యాల్లో సైతం చురుకుగా పాల్గొనలేకపోయాడు. దానితో సుధాముడికి, రాజు మనస్థితి పూర్తిగా అర్థమైంది.

ఒక రోజు సుధాముడు, మహారాజుతో ఆటలో ఓడిపోయాడు. మహారాజు పెదాల మీద చిరునవ్వు వెలిసింది. అది చూసిన సుధాముడికి, పరమానంద

దాసరి వెంకటరమణ



మైంది. ఆ తర్వాత ఏనాడూ ఆయన ఆటలో మహారాజును ఓడించలేదు.

కొంతకాలం గడిచింది. ఆట రోజూ మహారాజే గెలుస్తున్నాడు. కాని ఎందుకనో రాజుకు మునుపటిలా ఆటలో ఆనందం కలగడంలేదు. రాను రాను చదరంగం అంటే అనాసక్తత ఏర్పడసాగింది. ఆమాటే ఒకసారి మంత్రితో అన్నాడు.

సుధాముడు మహారాజులోని మార్పును గ్రహించాడు. ఒకనాడు ఆయన రాజుతో, "మహారాజా! మీరు ఎంతో ఇష్టంగా ఆడే చదరంగం ఆట, ఇప్పుడు అంత ఆనందం కలిగించడం లేదని అంటున్నారు కదా! చదరంగంలో గొప్ప నిపుణుడైన ఆనందు డనేవాడు వివిధ రాజ్యాల్లోని చదరంగం ఆటగాళ్ళను ఓడిస్తూ దేశాటన చేస్తున్నాడు. మీరు అనుజ్ఞ ఇచ్చినట్టయితే, అతడిని మన సువర్ణగిరికి పిలిపించి, చదరంగం పట్ల మీకు కలిగిన నిరాదరణకు కారణం అడగాలని ఉంది!" అన్నాడు.

రత్నపాలుడు అందుకు అంగీకరించ టంతో సుధాముడు, ఆనందుణ్ణి ఆహ్వానించి, మరునాడే మహారాజు సముఖానికి తీసుకువచ్చాడు.

ఆనందుడు, రత్నపాలుడు చెప్పింది పూర్తిగా విన్న తర్వాత, "మహారాజా! మీరు ఒకసారి నాతో చదరంగం ఆడితే, మీ సమస్యకు పరిష్కారం చెబుతాను," అన్నాడు.

వెంటనే మంత్రి సుధాముడి సమక్షంలో చదరంగం ఆట ఏర్పాట్లు జరిగాయి. మొదటి ఆటలో రత్నపాలుడే గెలిచాడు. ఆయన ముఖంలో ఆనందం తొణికిస లాడింది. ఆ తర్వాత ఆటలన్నీ వరుసగా ఆనందుడే గెలిచాడు. మహారాజు ఎంతగా ఆలోచించి, జాగ్రత్తగా ఆడినా ఆనందుణ్ణి ఓడించలేకపోయాడు. ఆయనలో ఉక్రోషం పెరిగింది. కోపంతో ముఖం ఎర్రబడింది. ఎన్ని ఆటలాడినా ఆనందుడే గెలు స్తున్నాడు. ఇక మహారాజులో సహనం నశించింది.

ఇది గమనించిన మంత్రి సుధాముడు, "మహారాజా! నన్ను ఒకసారి ప్రయత్నించి చూడమంటారా?" అని అడిగాడు.

రత్నపాలుడు నిరుత్సాహంగా తలూ పాడు. సుధాముడు, ఆనందుడితో చద రంగం ఆడి అతడిని అవలీలగా ఓడించాడు.

రత్నపాలుడికి జరిగింది కలో నిజమో అర్థంకాలేదు. ఆయనకు సుధాముడి గెలుపు ఎంతో ఆనందాన్ని కలుగజేసింది. ఆతర్వాత నాలుగైదు ఆటలు ఆడినా,

అన్నింటా సుధాముడే గెలిచాడు. రత్న పాలుడికి ఆనందంతోపాటు అంతులేని ఆశ్చర్యం కూడా కలిగింది.

ఆనందుడు, ఆయనతో, "మహారాజా! ఇప్పుడు మీకెదురైన ప్రశ్నకు సమాధానం చెప్పమంటారా?" అని ఇలా చెప్పాడు: "మహారాజా! ఆట ఆడేవాళ్ళకు ఆటలో ఆనందం రెండు విధాలుగా లభిస్తుంది. ఒకటి, ఆట గెలుపుద్వారా కలిగే ఆనందం. రెండు, జయాపజయాలతో నిమిత్తం లేకుండా, ఆట ఆడుతున్నంత సేపూ ఆటగాడికి కలిగే ఆనందం. మొదటిది, ఏది ఏమైనా విజయమే ముఖ్యం అనుకునే వాళ్ళలో వుంటుంది. ఆ ఆనందం మత్తుమందులాంటిది. మనిషిని పూర్తిగా వివశుణ్ణి చేస్తుంది. ప్రజ్ఞను హరిస్తుంది. ఆటలో అప్రమత్తత లేక మెలుకువలు తెలియవు. ఇక రెండవ ఆనందం ఔషధం లాంటిది. జయాపజయాలతో నిమిత్తం లేకుండా, ఆట ఆడే సమయంలో ఎదుటి వ్యక్తి ఆడే విధానాన్ని బట్టి ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ, ప్రతి క్షణం అప్రమత్తతగా వుంటూ, ఆట పూర్తయ్యేవరకు మనసుకు అపారమైన ఆనందం కలుగుతుంది. ఆటలో ఓడినా, ఎందుకు ఓడిపోయాము, ఎక్కడ తప్పుచేశాము అని పునరాలోచించడంలో మనస్సు నిమగ్నమౌతుంది. ఆటగాడు ఆ తప్పిదాన్ని ఆలోచించి పట్టుకొని, ఈసారి ఆడినప్పుడు ఇంకా బాగా ఆడాలి అనుకుంటాడే తప్ప, విచారించడు!" అని ఆగాడు.

అంతా శ్రద్ధగా వింటున్న రత్నపాలుడు, ఆనందుడి ముఖంలోకి చూస్తూ,



ఆగావం? ఇంకా వివరణ పూర్తయినట్టు లేదు?" అన్నాడు.

దానికి ఆనందుడు వినయంగా "మహారాజా! ఇంత సుదీర్ఘమైన వివరణతో మీకు విసుగు పుట్టిస్తున్నానేమో అన్న అనుమానం కలిగింది," అన్నాడు.

"అదేంలేదు. చదరంగం ఆడేవాళ్ళ రక రకాల మనస్తత్వాల గురించి అవగాహన, నాకవసరం!" అన్నాడు రత్నపాలుడు.

ఆనందుడు ఆ జవాబుకు చిరునవ్వు నవ్వి, "మహారాజా! మీరు ఆటలో విజయమే ముఖ్యమని భావిస్తుంటారు. అందుకే మహామంత్రి మొదటిసారి మిమ్మల్ని ఓడించినప్పుడు భరించలేక పోయారు. ఆ తర్వాత మీరు మంత్రిగారిని ఓడిస్తున్నప్పటికీ, మీకు ఆటపట్ల నిరాదరణ కలుగుతున్నదంటే, అందుకు

మరొక కారణం వున్నది. అదేమంటే ఎదుటి వాళ్ళను మీరు ఓడించినప్పుడు, వాళ్ళ ముఖాల్లో ఓడిపోతున్నామన్న బాధనుచూసి విజయగర్వంతో ఆనందించడం మీకు అలవాటయ్యింది. ఇప్పుడు మంత్రిగారు ఓడిపోయినప్పటికీ, వారి ముఖంలో ఆ బాధ తాలూకు ఛాయలు మచ్చుకైనా లేవు కాబట్టి, మీకు ఆ ఆనందం కలగడం లేదు. ఎందువల్లనంటే, మంత్రిగారు మిమ్మల్ని ఆటలో గెలవగలిగివుండీ కూడా కావాలని ఓడిపోతున్నారు కాబట్టి," అన్నాడు.

రత్నపాలుడు మాట్లాడకుండా, కళ్ళు మూసుకుని గతాన్ని ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఆనందుడు చెప్పిన విషయం అక్షరాలా నిజం. రత్నపాలుడు ఆనందుడి తెలివితేటలకు అబ్బురపడ్డాడు.

తర్వాత ఆయన కళ్ళుతెరిచి, ఆనందుడి వంకచూస్తూ, "మన మొదటి ఆటలో నువ్వెలా ఓడిపోయావు?" అని అడిగాడు.

ఆనందుడు చిరునవ్వు నవ్వి, "నేను మిమ్మల్నీ, మీరు ఆడే విధానాన్నీ గమనిస్తున్నాను. సహజంగా మీకు ఆటలో నైపుణ్యం ఉంది. అందువల్లనే ఓడించారు. మీ పద్ధతి తెలిసింది కాబట్టి, ఆ తర్వాతి ఆటలో దాన్ని ఎదుర్కొని కొత్త కొత్త ఎత్తుగడలతో ఆడాను. మీరు నా ఎత్తులు గమనించడం లేదు. అందుకే ప్రతిసారీ ఓడిపోయారు," అన్నాడు.

"మరి మా మహామంత్రి ప్రతిసారీ నిన్ను ఓడించాడు. అదెలా సాధ్యమైంది?" అని అడిగాడు రాజు.

"ఆయన నాకు చదరంగం ఆటను నేర్పిన గురువుగారు. అంతేగాక, ప్రతి రోజూ ఒక స్నేహితుడిలా, ఆటలో మెలకువలు తెల్పే మా తండ్రిగారు!" అంటూ తన మారువేషం తొలగించి, రత్నపాలుడి పాదాలకు నమస్కరించి, తన సాహసాన్ని మన్నించమని వేడుకున్నాడు, ఆనందుడు.

రత్నపాలుడు పట్టరాని ఆనందంతో, చూపులతోనే ఆనందుణ్ణి ప్రశంసించి లేవనెత్తి అక్కున చేర్చుకున్నాడు.

అది మొదలు రత్నపాలుడు, తీరిక దొరికినప్పుడల్లా ఆనందుడితోనూ, సుధాముడితోనూ చదరంగం ఆటలో జయాపజయాలను పట్టించుకోకుండా ఆటలో నిజమైన ఆనందాన్ని అనుభవించసాగాడు.



కావేరీ తీర ప్రయాణం-5

# మేకదాటు కావేరి

రచన: జయంతి మహాలింగం
చిత్రాలు: గౌతమ్ సేన్




కావేరి శివసముద్రం దాటి వచ్చాక, బెంగుళూరుకు దాదాపు 113 కి.మీ దూరంలో కనకపుర వద్ద అర్కావతి అనే ఉపనది వచ్చి కలుస్తున్నది. నందిదుర్గ కొండలలో పుట్టి ప్రవహిస్తున్న అర్కావతి నదికి అడ్డంగా చామరాజసాగర్ రిజర్వాయర్ నిర్మించబడింది. ఈ రిజర్వాయర్ నుంచే బెంగుళూరుకు నీటి సరఫరా జరుగుతోంది. దట్టమైన అడవుల మధ్య రెండు నదుల సంగమం జరుగుతోంది. పట్టుపురుగుల పెంపకానికి ఈ ఆటవిక ప్రాంతం ప్రసిద్ధిగాంచింది. దారి పొడవునా, వెదురు తడికలకు వేలాడుతూ వేలాది పట్టుపురుగుల గూళ్ళు కనిపిస్తాయి.

కావేరి అత్యంత వేగంతో రకరకాల బండల మధ్య దూసుకుపోతూ, ఒకచోట అగాథంలో కనిపించకుండా పోతూ, దూరంగా మరొక చోట అమిత వేగంతో పైకి ఉబుకుతూ, ఉత్సాహవంతుడైన చిలిపి కుర్రాడిలా దాగుడుమూతలాడుతూ ముందుకు సాగుతున్నది. కావేరీ వేగం కన్నా పెద్ద పెద్ద బండల మధ్య అది ప్రవహించే రాళ్ళదారి భయంకరమైనది. కావేరికి రెండు వైపులా వున్న బండలు నీలం, నలుపు, లేత ఎరుపు, తెలుపు ఇలా రకరకాల రంగులతో ఉన్నాయి. యుగయుగాలుగా ఉధృతంగా ప్రవహిస్తున్న జలప్రవాహం కారణంగా, ఆ బండలకు ఒకచోట ఏనుగుపాదాలు, మరొక చోట పెద్దరాక్షసపళ్ళెం, ఇంకొక చోట గుండ్రటి రూపం అంటూ చిత్ర విచిత్రమైన ఆకారాలను ఏర్పరచి ఉన్నది.

వేగంగా ప్రవహిస్తున్న నదికి మధ్యలో ఒక భయంకరమైన సుడిగుండం ఏర్పడి ఉన్నది. దానిని 'హన్నడు చక్ర' అని అంటారు. ఏదైనా వస్తువు ఈ సుడిగుండంలో చిక్కుకున్నట్టయితే, గిర్రున పన్నెండుసార్లు తిరిగి ఆ తరవాతే అగాథంలో మునిగిపోతుందంటారు!

అర్కావతి సంగమానికి ఐదు కి.మీ దూరంలో సుప్రసిద్ధమైన 'మేకదాటు' కావేరి ఉన్నది. రెండు ఎత్తయిన బండల నడుమ 18 మీ. లోతుకు కావేరి ఉరుకుతూ వెళుతుంది. బ్రహ్మాండమైన

మేకదాటు





హొగనెకల్ జలపాతం



రెండు స్తంభాల్లాంటి ఈ రెండు బండలలో ఒకటి పగిలి ఉన్నది. ఒక బండకూ, మరొక బండకూ మధ్య దూరం మేక దాటేంత సన్నగా ఉండడం వల్ల, దీనికి మేకదాటు కావేరి అనే పేరు వచ్చింది!

మేకదాటు నుంచి కావేరి దక్షిణదిశగా తిరిగి, మేలగిరి కొండల మధ్యగా ప్రవహిస్తూ, కర్నాటక రాష్ట్రానికి చెందిన మైసూరు - బెంగుళూరు జిల్లాలకూ; తమిళనాడు ధర్మపురి-సేలం జిల్లాలకూ మధ్య సహజ సరిహద్దుగా ఉంటోంది. అక్కడి నుంచి ముప్పై మైళ్ళదూరంలో తమిళనాడులోని తోప్పూర్ కొండలలో కావేరి మరొకసారి పెద్దగా కిందికి ఉరుకుతుంది. హొగనెకల్ అంటే పొగలు చిమ్మేరాయి అని అర్థం. ఇక్కడ కావేరి రెండు శాఖలుగా చీలిపోయి, పడమటి శాఖ 22 మీ. ఎత్తునుంచి కిందికి దూకుతూ అద్భుత దృశ్యాన్ని సృష్టిస్తోంది. జలప్రవాహం వేగంగా కిందవున్న బండమీద పడి, నీటి తుంపర్లు పైకి ఎగయడం వల్ల చుట్టుపక్కల దట్టమైన పొగ కమ్ముకుని ఉన్నట్టు వింత దృశ్యం కనిపిస్తుంది.

తూర్పుగా వెళ్ళే శాఖ మళ్ళీ రెండు పాయలుగా చీలుతుంది. ఒక పాయ మేకదాటులాంటి మరొక కొండ సందు గుండా ప్రవహిస్తుంది. ఇది 'జ్ఞానతీర్థ'గా ప్రసిద్ధిగాంచింది. ఇక్కడ స్నానం చేయడానికి వచ్చే యాత్రీకుల రక్షణకోసం ఇనుప ఊచలు అమర్చబడి ఉన్నాయి. ఆడి పదినెట్టు (తమిళమాసం ఆడి పద్ధెనిమిదవ తేది); ఐప్పసి (అక్టోబర్-నవంబర్) పౌర్ణమి రోజున ఈ జ్ఞానతీర్థంలో స్నానం చేయడానికి భక్తులు అసంఖ్యాకంగా వస్తారు. తమిళ నెల ఐప్పసి పౌర్ణమిరోజున ఈ ప్రాంత ప్రజలు, పిల్లాజల్లతో కుటుంబసమేతంగా వచ్చి పవిత్ర నదీస్నానం చేసి, నదీమతల్లిని పూజించి, విందుభోజనం చేస్తారు.

స్నానఘట్టానికి ఎగువ దశేశ్వర స్వామి ఆలయం ఉన్నది. కావేరీ పుట్టుకకు మూల కారణంగా చెప్పబడే అగస్త్యముని ఈ ఆలయాన్ని దర్శించి స్వామిని సేవించుకున్నాడని చెబుతారు.



యువతి కొయ్యకొసను పట్టుకుని ఎగిరి నదిని దాటింది



హొగనెకల్ జలపాతం వద్ద, నదిలో వెళ్ళి చుట్టుపక్కల ప్రకృతి దృశ్యాలను చూడడానికీ; పైనుంచి కిందికి ఉరికే ప్రవాహాన్ని దగ్గరి నుంచి చూడడానికీ వీలుగా, తుంగతో అల్లిన గుండ్రటి చిన్న పడవలనే ఉపయోగిస్తున్నారు. ఒక్కొక్క పడవలో ఏడుగురు వెళ్ళవచ్చు. యాత్రీకులను నదిలో తిప్ప డానికి పడవవాళ్ళు పోటీపడివస్తారు. ఒకవైపు ఎత్తయిన కొండలూ, మరొకవైపు అడవీ, వీటి మధ్య పారుతున్న నదిలో ఒక చిన్న తెడ్డు వేస్తూ పడవవాళ్ళు యాత్రీకులను తీసుకువెళతారు.

జలపాతానికి దిగువ ఉత్తరంగా చిన్నార్ అనే మరొక ఉపనది కావేరిలో కలుస్తున్నది. దీనిని సనత్కుమార నది అని కూడా చెబుతారు. ఎందుకంటే ఈ నది పుట్టే బావిని సనత్కుమారుడనే ముని ఏర్పరచాడని ఒక కథ ప్రచారంలో ఉన్నది. ఈ ప్రాంతంలో ఇరుబల నాయకన్

గుండ్రటి తుంగపడవలు

అనే ఒక కొండతెగ నాయకుడు ఉండేవాడు. అతడు ఒకనాడు నదీ తీరంలో కూర్చుని, ఆవలి తీరంలో పొడవైన వెదురు గడ మీదికి ఎక్కి రకరకాల విన్యాసాలు చేసి చూపుతూన్న ఒక యువతిని చూశాడు. వెంటనే అతడు ఆ కొయ్య ఆధారంతో అలాగే ఎగిరి ఈగట్టుకు రాగలవా? అని ఆమెను సవాలు చేశాడు. ఆ యువతి,



కావేరిలో లభించే మాసీర్ చేప

కొయ్యకొసను పట్టుకుని మొదలును నేలకు ఆనించి, ఒక్క ఊపులో ఎగిరి నదిని దాటి వచ్చి అతడి ఒడిలో వాలింది!

ఈ సంఘటనను గురించి విన్న మైసూరు రాజు, పవిత్రస్థలాన్ని అపవిత్రం చేసిన ఇరుబల నాయకుడి దుష్ట ప్రవర్తనకు ఆగ్రహించి, మిగతా వారికి హెచ్చరికగా ఉండాలని అతన్ని కఠినంగా శిక్షించాడని చెప్పుకుంటారు.



హొగనెకల్ వద్ద చేపలు పుష్కలంగా దొరుకుతాయి. మాసీర్ అనే పెద్ద చేప ఇక్కడి ప్రత్యేక ఆకర్షణ. ఒక్కొక్క చేప యాభై కిలోల వరకు పెరుగుతుంది. ఒకప్పుడు ఈ చేపలు విరివిగా లభించేవే గాని, ఇటీవలి వాతావరణ కాలుష్యం వల్ల వీటిసంఖ్య బాగా తగ్గిపోయింది.

కావేరి దక్షిణం కేసి తిరిగి, మరింత విశాలంగా రూపొంది, హొగనెకల్లుకు దాదాపు 50 కి.మీ దూరంలో, అది తమిళనాడులో ప్రవేశించే చోట మేట్టూర్ డ్యామ్ నిర్మించబడింది. 1834వ సం॥లో బ్రిటిష్ ఇంజనీర్ ఆర్థర్ కాటన్


మేట్టూరు డ్యామ్

దీనికి ప్రప్రథమంగా రూపకల్పన చేశాడు. కాని 1910వ సం॥ నాటికి ఈ ఆనకట్ట నిర్మాణ పథకం ఒక నిర్దిష్ట రూపం దాల్చింది. 1928వ సం॥లోనే నిర్మాణం పనులు ప్రారంభమయ్యాయి. మైసూరు నుంచి సరఫరా అయిన విద్యుత్తు సాయంతో దాని నిర్మాణం ఆరేళ్ళ రికార్డు టైములో పూర్తయింది.

మేట్టూరు డ్యామ్ 1590 మీ. పొడవూ, 51 మీ వెడల్పూ, 64.2 ఎత్తూ కలిగి ఉన్నది. అది నిర్మించబడినప్పుడు ప్రపంచంలో యంత్రాలు అంతగా ఉపయోగించకుండా మనుషులు మాత్రమే నిర్మించిన అతి పెద్ద డ్యామ్‌గా ప్రసిద్ధిగాంచింది. ఇది దాదాపు 60 చ.కి.మీ విస్తరించి ఉన్నది. గవర్నర్ జనరల్ సర్ జార్జ్ స్టాన్లీ పేరు మీదుగా దీనికి 'స్టాన్లీ లేక్' అని పేరు పెట్టారు. డ్యామ్‌కు దిగువ నిర్మించబడిన జలవిద్యుత్ కేంద్రం 36,000 కి.వా. విద్యుత్తును ఉత్పత్తి చేస్తోంది.

1952వ సం॥లో ఏర్పడిన కరువు సమయంలో నీటిమట్టం 8-9 మీ. ఎత్తే ఉండేది. 1975వ సం॥లో అంతకన్నా ఘోరమైన అనావృష్టి పరిస్థితి ఏర్పడింది.

తమిళనాడులోని సేలం-పెరియార్ జిల్లాలకు మధ్య సరిహద్దుగా కావేరి ప్రవహిస్తున్నది. సేలంకు ఉత్తరంగా వున్న సేర్వరాయ కొండలలో పుట్టి సేలం పట్టణం గుండా ప్రవహించే తిరుమణి ముత్తారు, దక్షిణంగా వున్న నామక్కల్ సమీపంలో కావేరిలో కలుస్తున్నది. తమిళంలో 'ముత్తారు' అంటే 'ముత్యాలయేరు' అని అర్థం. ఈ నదీ గర్భంలో ఒకప్పుడు ముత్యాలు లభించడంవల్ల, దీనికి ఆ పేరు వచ్చిందని చెబుతారు. సేలంలోని ప్రధాన శివాలయంలోని అమ్మవారి విగ్రహానికి అలంకరించే ప్రకాశవంతమైన పెద్దముత్యం, మణిముత్తారులోనే లభించిందని చెబుతారు. పెరుగుతూన్న పట్టణం, జనాభా, పరిశ్రమల కారణంగా ఇవాళ ముత్తారు ఒక మురుగుకాల్వగా మారిపోయింది. వర్షాకాలంలో అయితే, మరీ యేరు పొంగి సేలం వీధులను మురికినీళ్ళతో ముంచెత్తుతోంది.

సేలం చేనేత పరిశ్రమకూ, ఉక్కు పరిశ్రమకూ కేంద్రంగా ఉంటోంది. దుప్పట్లకూ, బెడ్ షీట్లకూ, జరీ అంచు పట్టువస్త్రాలకూ, మామిడి పళ్ళకూ ప్రసిద్ధిగాంచింది. సేలం పట్టణానికి ఎగువ సేర్వరాయ కొండ సానువులలో వున్న ఏర్కాడు వేసవి విడిది అందరికీ తెలిసినదే. మండువేసవిలో కూడా ఇక్కడి వాతావరణం చాలా చల్లగా ఉంటుంది. అందువల్ల పర్యాటకులు అధిక సంఖ్యలో వస్తూ ఉంటారు.



# ముగ్గురు యక్షిణులు-మూడు వరాలు

రామయ్య, రాజయ్యలు ఇరుగు పొరుగు ఇళ్ళ వాళ్ళు. రామయ్య వున్న పొలాన్ని వృద్ధిచేసుకుని, పాత పెంకుటిల్లున్నచోట మిద్దె వేసుకుని పొదుపుగా కాపురం చేస్తున్నాడు. రాజయ్య లేనిపోని ఆడంబరాలకు పోయి వున్న పొలం అమ్ముకుని, పాతకాలపు పెంకుటింట్లో అనారోగ్యంగా వుండే తల్లితో, సాధించిపోసే పెళ్ళాంతో, ఊరినిండా అప్పులతో సతమతమవుతున్నాడు. రామయ్య పట్ల, రాజయ్య ఇంటిల్లిపాదీ ఎంతో అసూయగా వుండేవాళ్ళు.

రామయ్య, రాజయ్యలిద్దరూ ప్రతినెలా పట్నం వెళ్ళి, తమ పల్లెలో దొరకని సరుకులు కొనుక్కుని, గోతాముల్లో వేసుకుని, అడవిదారిన ఇంటికి తెచ్చుకునేవారు. ఆ రోజున కూడా వాళ్ళు సంతలో సరుకులు కొని, గోతాములు నెత్తిన పెట్టుకుని తిరుగుప్రయాణమయ్యారు.

దారిలో రామయ్య ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ, "మనదేశపు రాణీగారు హఠాత్తుగా పోవడంతో, రాజుగారు పుట్టెడు దుఃఖంలో వున్నారు. ఇటువంటి సమ యంలో పొరుగురాజు యుద్ధం ప్రకటించాడు!మనం యుద్ధంలో ఓడిపోతామేమో అని బెంగగా వుంది," అన్నాడు.

అందుకు రాజయ్యనవ్వి, "రాజధానీ నగరంలో సింహాసనంమీద ఎవరుంటే మనకేం? మనకు ఈ నెలసరి సంత ప్రయాణాలూ, అడవిదారి గోతాంమోతలూ తప్పవుగదా!" అన్నాడు.

"అది సరే! ఆ వానదేవుడు మన ఊరిమీద పగపట్టినట్టుగా, రెండేళ్ళనుంచి వర్షాలు లేవు!" అన్నాడు రామయ్య, శ్రావణమాసంలో నిప్పులు చెరుగుతున్న ఎండవేడిమికి తాళలేక.

మాచిరాజు కామేశ్వరరావు



ఈ సంగతి తేలిగ్గా తీసుకుంటూ రాజయ్య, "పొలం పుట్రా వున్న వాడివి కాబట్టి, నీకు వర్షాలు లేవని దిగులు. నా లాంటివాడికి పోయేదేమిటి? ఈ ఊరు కాకపోతే మరొకవూరు," అన్నాడు.

వాళ్ళు దారిలోంచి అడ్డదారి అయిన అడవిదారిలోకి మళ్ళుతూండగా, రాజయ్య బంధువులు ఎవరో, బాడుగ బండిలో వెళుతూ కనిపించారు. రాజయ్య ఆ బండిని ఆపించి, "రామయ్యా! బండిలో ఒకరికి మాత్రమే చోటుంది. ఏమీ అనుకోకేం!" అంటూ బండి ఎక్కివెళ్ళిపోయాడు.

రామయ్య ఒంటరిగా అడవిదారిన వస్తూండగా, దారిలో అడ్డంగా పడివున్న ఎండుకొమ్మ ఒకటి కాలికి తగిలి బోర్లాపడ్డాడు. గోతాంలోని సరుకులన్నీ చెల్లాచెదురయ్యాయి. అతడికి స్పృహ తప్పింది.

మళ్ళీ రామయ్యకు తెలివి వచ్చేసరికి చీకటిపడబోతున్నది. అతడు కిందపడిన సరుకులన్నీ గబగబా గోతాంలో వేయసాగాడు. ఆ సమయంలో పాతకాలపు రాగి ఉంగరం ఒకటి అతడి చేతికి చిక్కింది. దాన్ని వేలుకుపెట్టుకుని, గోతామును తలమీద పెట్టుకోబోతుండగా, ఎదురుగా కనిపించిన అద్భుతాన్ని చూసి ఉక్కిరిబిక్కిరయ్యాడు.ఎదురుగావున్న చెట్లగుంపు మధ్య, కళ్ళుచెదిరేకాంతులతో అందమైన భవనం. పగలు వెళ్ళేటప్పుడు లేని భవనం ఇప్పుడెలా వచ్చినట్టు?

రామయ్య గోతాము కిందకు దింపి, రెప్పవేయకుండా ఆ భవనంకేసి చూడసాగాడు. అంతలో వేలికి పెట్టుకున్న పాతకాలపు రాగి ఉంగరం బిగుతనిపించడంతో, దానిని మరొక వేలుకు పెట్టుకుందామని తీశాడు రామయ్య.

ఆశ్చర్యం! కాంతులీనే ఆ అద్భుత భవనం కళ్ళముందునుంచి అదృశ్యమైపోయింది. రామయ్య నివ్వెరపోతూ ఉంగరం మరొక వేలికి పెట్టుకున్నాడు. మళ్ళీ భవనం కళ్ళముందు ప్రత్యక్షమైంది. దానితో అతడికి ఆ ఉంగరం మహిమ తెలిసిపోయింది. అది వేలికి వుంటేనే, ఆ భవనం కనిపిస్తుందన్నమాట! బయటికే అంత సుందరంగా కనిపిస్తున్న భవనం, లోపల మరెంత అద్భుతంగా వుంటుందో చూడాలన్న కోరిక పుట్టింది రామయ్యకు.

అతడు అడుగులో అడుగు వేసుకుంటూ పోయి, భవనంలో ప్రవేశించాడు.

ముందు విశాలంగా వున్న గదిలో, అద్భుత సౌందర్యరాసులైన ముగ్గురు యక్షిణులు నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళు హఠాత్తుగా లోపలికి వచ్చిన రామయ్యను చూసి నిర్ఘాంత పోయి, "ఎవరు నువ్వు?" అని అడిగారు.

రామయ్య వాళ్ళకు తనను గురించి చెప్పుకుని, "ఇదేదో నేవిన్న ఇంద్రభవనంలా వున్నది. ఒకసారి భవనమంతా తిరిగి చూసి, నా దారిన పోతాను," అన్నాడు.

ఆ జవాబుకు యక్షిణులు అదిరిపడి, "మానవ మాత్రులకు ఇందులో ప్రవేశం నిషిద్ధం, వెళ్ళిపో. కావాలంటే ముగ్గురం తలొకవరం యిస్తాం," అన్నారు.

"ఈ భాగ్యానికి వరాలు దేనికి! నేను వెళ్ళిపోతాను," అంటూ వెనుదిరిగాడు రామయ్య.

"ఆగు! నీకు వరాలు పుచ్చుకోవడానికి ఇష్టంలేకపోయినా, మాకు ఇవ్వాలన్న కోరిక కలిగింది. మా పేర్లు ఉదయ, సంధ్య, నిశి. ఒక్కొక్క వరం కోరుకునే టప్పుడు, ఒక్కొక్కరి పేరు ఏడుసార్లు స్మరించు," అన్నారు యక్షిణులు.

రామయ్య, ఉదయ అనే యక్షిణి పేరు ఏడుసార్లు స్మరించి, "మాదేశంమీదికి దండెత్తిన పొరుగురాజు మనసుమార్చుకుని వెనుదిరిగి పోవాలి!" అని కోరాడు.

"నీ దేశభక్తి బహు దొడ్డది!" అని మెచ్చుకున్నది ఉదయ.



ఈసారి రామయ్య, సంధ్య పేరు ఏడు సార్లు స్మరించి, "మా ఊరు అతివృష్టి, అనావృష్టిలాంటివి లేకుండా, కలకాలం పచ్చగా వుండాలి!" అని కోరుకున్నాడు.

"పుట్టిన గడ్డమీద నీకున్న ప్రేమ అమోఘం!" అన్నది సంధ్య.

రామయ్య కొద్దిసేపు ఆలోచించి, "మా ఇంటిల్లిపాది వున్నంతలో తృప్తిగా, సంతోషంగా వుండాలి," అన్నాడు.

"చాలా గొప్ప వరం కోరావు! మనిషికి సంతోషం సగం బలం అంటారు. మరే వరం కోరినా, ఇంతటి సంతోషం మీకు దక్కదు. ఇంతకన్నా మంచివరం కోరలేదే అనే బాధ జీవితాంతం, మీ ఇంటి వాళ్ళందర్నీ దుఃఖించే లాగా చేస్తుంది," అన్నది నిశి.



రామయ్య, యక్షిణులకు నమస్కరించి, తన ఊరుకు తిరుగు ప్రయాణం అయ్యాడు. అతను ఇల్లు చేరేసరికి తెల్లవారవస్తున్నది.

గుమ్మంలో ఎదురైన రామయ్య భార్య, "ఈ శుభవార్త విన్నావా? పొరుగురాజు యుద్ధప్రయత్నం విరమించుకుని రాజు గారికి క్షమార్పణలు చెప్పుకున్నాడట!" అన్నది ఆనందంగా.

ఆమె ఆ మాట పూర్తి చేసేలోపలే, హఠాత్తుగా మేఘాలు కమ్ముకుని కుండ పోతగా వర్షం కురిసింది. దానితో రామయ్యకు, యక్షిణుల వరాలు ఫలించిన సంగతి అర్థమైపోయింది. అతడు, భార్యకు తన వేలికి వున్న ఉంగరంతీసి చూపించి, జరిగినదంతా చెప్పాడు. ఆమె ఉంగరాన్ని కళ్ళకద్దుకుని,పూజాగదిలోభద్రంగా దాచింది.

అయితే, రామయ్య క్రితం రాత్రే ఎందుకు తిరిగిరాలేదో తెలుసుకుందామని వచ్చిన రాజయ్య, కిటికీలోంచి ఆ భార్యాభర్తల సంభాషణ అంతా విన్నాడు. అతడు వెంటనే ఇంటికి తిరిగివెళ్ళి, భార్యకు జరిగింది చెప్పి, "నువ్వు తక్షణం వెళ్ళి ఏదో విధంగా ఆ మహిమగల ఉంగరం పట్టుకురా. నేను ఆ ముగ్గురు యక్షిణుల నుంచి మూడువరాలు సంపాయించుకు వస్తాను," అన్నాడు ఉత్సాహంగా.

"ఓరే, అందులో ఒక వరం, నాకివ్వు, నేను కోరుకుంటాను," అన్నది రాజయ్య తల్లి. ఆమె చాలాకాలంగా అనారోగ్యంతో బాధపడుతున్నది.

"ఒక వరం నేను కోరుకుంటాను," అన్నది రాజయ్యభార్య అత్తకు పోటీగా.

"సరే, మూడు వరాలూ ముగ్గురం పంచుకుందాం. ముందు నువ్వెళ్ళి, ఆ ఉంగరం తస్కరించుకురా!" అంటూ రాజయ్య, భార్యను తొందరపెట్టాడు కోపంగా.

ఆ సమయంలో రామయ్య పెరట్లో స్నానంచేస్తున్నాడు. ఆయన భార్య వంట గదిలో వున్నది. రాజయ్య భార్య పెరట్లో నాలుగు మందారపువ్వులు కోసుకుని, "వదినా! శుక్రవారం కదా, లక్ష్మీపూజకు పూలుతెచ్చాను," అంటూ ముందు గది లోంచి కేకవేసింది.

"దేవుడి గదిలో పెట్టి వెళ్ళువదినా!" అన్నదివంటపనిలోవున్నరామయ్య భార్య. రాజయ్యభార్య పువ్వులు దేవుడి గదిలో

పెట్టి అక్కడ వున్న రాగిఉంగరాన్ని కొంగుకు ముడివేసుకుని, తన ఇంటికి వెళ్ళిపోయింది. ఆ ఉంగరం తీసుకుని, రాజయ్య అప్పటికప్పుడు అడవిచేరి, ఉంగరాన్ని వేలికి పెట్టుకుని, యక్షిణుల భవనంలోకి ప్రవేశించాడు.

రాజయ్యను చూసి యక్షిణులు నివ్వెర పోయి, "ఎవరు నువ్వు? ఇక్కడికెందు కొచ్చావు?" అని గద్దిస్తూ అడిగారు.

"మూడు వరాలకోసం వచ్చాను!" అన్నాడు రాజయ్య తొణక్కుండా.

యక్షిణులు తమలో తాము కూడ బలుక్కుని, "నీకు వరాలుయిస్తాం. అయితే, ఆ రాగి ఉంగరం మాకిచ్చేయాలి," అన్నారు.

"అలాగే యిస్తాను. అయితే, వరాలు నేనిక్కడకోరను. మా అమ్మ, నా భార్య, నేను తలా ఒకటీ మా ఇంట్లో కోరుకుంటాం. మీ పేర్లు ఏడుమార్లు స్మరించాలి, వరం కోరాలి! అదే కదా పద్ధతి?" అన్నాడు రాజయ్య.

"అవును, అలాగే చేయాలి!" అంటూ రాజయ్య దగ్గరి ఉంగరం తీసుకున్నారు యక్షిణులు.

ఆ మరుక్షణం యక్షిణులు లేరు, భవనంలేదు. రాజయ్య అడవిమధ్యలో వున్నాడు!

వచ్చిన పని అయిందికదా? యక్షిణు లుంటేనేం, లేకుంటేనేం, అనుకుంటూ, రాజయ్య ఉత్సాహంగా ఇల్లు చేరేసరికి, భార్యా, తల్లీ అతడికోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.



రాజయ్య వాళ్ళకు జరిగింది చెప్పాడు. వెంటనే యక్షిణి ఉదయ పేరును రాజయ్యతల్లి ఏడుసార్లు, సంధ్య పేరును రాజయ్యభార్య ఏడుసార్లు, నిశి పేరును రాజయ్య ఏడుసార్లు స్మరించి-ఏంవరం కోరుకోవాలా అన్న ఆలోచనలో పడ్డారు.

ముందుగా రాజయ్యతల్లి, "నాకు నిండు నూరేళ్ళు ఆయువు కావాలి," అని కోరుకున్నది.

అనారోగ్యంగా వున్న అత్తకు సేవ చేయలేక సతమతమవుతున్న రాజయ్య భార్య, "ఆయువుదేనికిఅత్తా? బతికినంత కాలం లేచి తిరగగలిగితే అదేపదివేలు!" అన్నది.

అంతే రాజయ్యతల్లి ఠక్కున మంచం మీద లేచి కూర్చున్నది.



ఎదుటివారికి బోధించడానికి ధర్మం గురించి పాండిత్యం సంపాదించడం అందరికీ సులభమే. అయితే, ధర్మాన్ని జీవితంలో ఆచరించి చూపడం ఒక్క మహాత్ములకు మాత్రమే సాధ్యం. —హితోపదేశం

అష్టయిశ్వర్యాలు కోరుకోవాలనుకున్న తను, అనాలోచితంగా అన్నమాటలతో, తనవరం వ్యర్థం అయిపోయిన సంగతి గ్రహించిన భార్యకు దుఃఖం పొంగుకు వచ్చింది.

తన తల్లి అనారోగ్యం బాగుపడినందుకు, పెళ్ళాం ఈర్ష్యపడుతున్నదని తెలుసుకున్న రాజయ్య, చిరాగ్గా "మంచాన పడిన అత్త లేచి కూర్చుంటే, ఎందుకా ఏడుపు? కొంపకూలబోతున్నదా ఏం! పక్కింటి రామయ్యకోటికిపడగలెత్తితే–నీకు బతికి నన్నాళ్ళు ఏడు పేగదా?" అన్నాడు.

రాజయ్య మాటలు ముగించగానే, టప టప మంటూ అతడి ఇంటి పెంకులు రాలి పడడం ఆరంభమైంది. ఇల్లు అటూ యిటూ ఊగిపోతుండడంతో, ఎక్కడ కూలి నెత్తిన పడుతుందో అని ముగ్గురూ ప్రాణాలు అరచేత పెట్టుకుని వీధిలోకి పరుగు పెట్టారు. చూస్తూండగానే దభీ మంటూ ఆ పాతకాలపు పూరిల్లు కూలి పోయింది.

ఆ వెంటనే ఆశ్చర్యంగా రామయ్య డాబా ఇల్లు ఐదంతస్థుల భవనంగా మారిపోయింది. అతడి ఇంటినిండా నగలూ, నాణ్యాలూ! ఎంత నిగ్రహించు కుందామనుకున్నా రాజయ్యభార్య ఏడుపు ఆగడం లేదు!

చిరాకు కొద్దీ తను మాట్లాడిన మాటలు, తనకు బెడిసికొట్టినా రామయ్య పాలిట వరాలుగా మారినట్లు గ్రహించి, రాజయ్య దిగాలుపడిపోయాడు.

తర్వాత రాజయ్య, ఇక ఆ ఊళ్ళో వుండడానికి మొహం చెల్లక, అప్పటి కప్పుడే ఏడుపుగొట్టు భార్యనూ, తల్లినీ వెంటబెట్టుకుని ఊరువదిలి వెళ్ళి పోయాడు.



49. విశ్వరూప దర్శనం

# మహాభారతం

పరశురాముడు మాట్లాడటం చాలించ గానే కణ్వమహాముని కౌరవసభలో దుర్యోధనుడితో, "ధర్మరాజుతో సంధి చేసుకోవటం మంచిది. కౌరవ పాండవులు భూమినంతనూ కలిసి పాలించవచ్చు. నువ్వే బలవంతుణ్ణనుకోకు. అవతల వాళ్ళుకూడా బలవంతులే అయినప్పుడు బలం అనేదానికి అర్థంలేదు. ఈ సందర్భంలో నీకు మాతలి కథ చెబు తాను," అంటూ ఇలా చెప్పాడు:

దేవేంద్రుడి సారథి అయిన మాతలికి లేక లేక ఒక చక్కదనాల కూతురు కలిగింది. గుణకేశి అనే ఆ పిల్ల అందచందాలలో అందరు స్త్రీలనూ మించింది. ఆమెకు యుక్తవయసు వచ్చేసరికి ఆమె తల్లి దండ్రులు వివాహం తలపెట్టారు. మాతలి ఎంత వెతికినా తన కుమార్తెకు తగిన వరుడు ఎక్కడా లభించలేదు. దేవలోకం లోనూ, మానవలోకం లోనూ చూడటం అయిన తరవాత మాతలి తన కుమార్తెతో సహా నాగలోకానికి ప్రయాణమయ్యాడు.

దారిలో అతనికి నారదుడు తటస్థపడి, "నేను వరుణుడి వద్దకు పోతున్నాను. నీ ప్రయాణం ఎక్కడికి?" అని అడిగాడు. మాతలి తాము పోతున్న పని నారదుడికి చెప్పి, "నేను కూడా వరుణుడి దగ్గరికే పోతున్నాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి వరుణుడి దగ్గరికి వెళ్లారు. వరుణుడు వారికిద్దరికీ తగిన విధంగా అతిథి సత్కారాలు చేసి, మాతలి వచ్చిన పని తెలుసుకుని, నాగలోకంలో తిరగటానికి అనుమతి ఇచ్చాడు. నార





పోయినందుకూ, నా మనమడు పోబో తున్నందుకూ, మేము పుట్టెడు దుఃఖంలో మునిగి ఉన్నాం.నేనీ సంబంధానికి ఎలా ఒప్పుకోను?" అన్నాడు.

ఆ మాటవిని మాతలి కొంచెం ఆలో చించి, "మహానుభావా, నాకొక ఆలోచన తట్టింది. నీ మనమడైన సుముఖుణ్ణి నావెంటా, నారదుడి వెంటా ఇంద్రుడి వద్దకు పంపిస్తే, నేను చెయ్యవలసినది చేసి, అతనికి పూర్ణాయువు కలిగేటట్టు చూస్తాను," అన్నాడు.

ఆర్యకుడు అందుకు సమ్మతించాడు. మాతలి సుముఖుణ్ణీ, ఇతర ముఖ్యు లనూ వెంటబెట్టుకుని ఇంద్రుడి వద్దకు తిరిగి వచ్చాడు. అక్కడ విష్ణువు దేవేం ద్రుడితో కబుర్లాడుతూ ఉన్నాడు. మాతలి అభిప్రాయం చెప్పగానే విష్ణువు ఇంద్రుడితో, "సుముఖుడికి అమృతం ఇచ్చి దేవతలతో సమానుణ్ణి చెయ్యి. ఆ విధంగా మాతలి నారదుల కోరిక తీరుతుంది," అన్నాడు. గరుత్మంతుడికి ఆగ్రహం తెప్పించడానికి భయపడి ఇంద్రుడు విష్ణువుతో, "సుము ఖుడికి నీవే అమృతం ఇయ్యి," అన్నాడు.

"అన్ని లోకాలనూ పాలించేవాడివి, నిన్ను ఆపగల వారెవరు? నువ్వే సుము ఖుడికి అమృతం ఇయ్యి," అన్నాడు విష్ణువు. కాని ఇంద్రుడు సుముఖుడికి దీర్ఘాయివు ఇచ్చాడు గాని అమృతం ఇయ్యలేదు. సుముఖుడు గరుత్మంతుడి భయంలేక మాతలి కుమార్తెను పెళ్లాడి సుఖంగా ఉన్నాడు.

దుడూ, మాతలీ నాగలోకమంతా తిరిగి, అనేకమంది యువకులను చూశారు. శేషుడుండే భోగవతీపురంలో సుముఖుడు అనే నాగయువకుడు మాతలికి నచ్చాడు.

"గుణకేశికి ఈ కుర్రవాడు తగిన వరుడు. అందుచేత అతన్ని వివాహానికి ఒప్పించు," అని మాతలి నారదుణ్ణి కోరాడు.

నారదుడు సుముఖుడి తాత అయిన ఆర్యకుడికి మాతలిని పరిచయంచేసి, అతని కోరిక తెలిపాడు.

ఆర్యకుడు ఈ మాటకు సంతోషించి కూడా పైకి దైన్యం కనబరుస్తూ, "నారదా, ఈ వివాహానికి ఎలా ఒప్పుకోను? ఇటీవల గరుత్మంతుడు నా కొడుకును చంపి వచ్చే మాసంలో నా మనమడైన సుముఖుణ్ణి తింటానని ప్రతిజ్ఞ చేసి వెళ్ళాడు. నా కొడుకు

ఈ సంగతి తెలిసిన గరుత్మంతుడు మండిపడి ఇంద్రుడి వద్దకు వచ్చి, "నా నోటి ముందున్న ఆహారానికి ఏమని అడ్డం తగిలావు? ఆహారం లేక నేనూ, నా వాళ్లూ చచ్చిపోమా? నేను ఎంత బలవంతుణ్ణి! నన్ను తేలికగా చూస్తావా? నేను నిన్ను ఒక చిన్న ఈకతో మోయగలను," అన్నాడు.

అప్పుడు విష్ణువు, "గరుడుడా, నా ఎదుటనే ప్రగల్భాలాడకు. నన్ను మోస్తున్నాననుకుని నీకు గర్వంలా ఉన్నది. నిజానికి నేనే నిన్ను మోస్తున్నాను. చేతనైతే నా ఎడమచెయ్యి మోయి!" అంటూ తన ఎడమ చేతిని గరుత్మంతుడి వీపు మీద పెట్టాడు. దాని బరువుకు గరుత్మంతుడు కూలబడిపోయి కళ్ళు తేలవేశాడు. అతనికి ప్రాణాలు పోతున్నట్టు అనిపించింది. గరుత్మంతుడు క్షమాపణ చెప్పుకుని, తనను కాపాడమని విష్ణువును వేడుకున్నాడు.

కణ్వుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, "దుర్యోధనా, పాండవులు యుద్ధంలో నిన్ను తలపడగానే నీకు కూడా గరుత్మంతుడికి జరిగిన భంగపాటే కలుగుతుంది. మిమ్మల్ని కాపాడటానికి కృష్ణుడు వచ్చాడు. అతను చెప్పినట్టు చేసి నీ కులాన్ని కాపాడుకో," అన్నాడు.

దుర్యోధనుడు కర్ణుడికేసి చూసి వెకిలిగా నవ్వాడు. తరవాత అతను కణ్వుడితో, "మహర్షీ, నన్ను దేవుడు ఇలా పుట్టించాడు. నాకు ఎలా జరగవలసి ఉన్నదో నా ప్రవర్తన దానికి అనుగుణంగా ఉన్నది. నాకు నెయ్యి మాటలు చెప్పి ఏం ప్రయోజనం?" అన్నాడు.



తరవాత నారదుడు దుర్యోధనుడితో, "నాయనా, హితం చెప్పేవాళ్ళు చాలా అరుదు. అలాటి వాళ్ళు మంచిమాటలు చెబితే మొండికెయ్యరాదు. దీనికి దృష్టాంతంగా నీకు గాలవుడి కథ చెబుతాను," అంటూ ఇలా చెప్పాడు:

గాలవుడు విశ్వామిత్రుడి శిష్యుడు. అతను విద్య పూర్తిచేసుకుని వెళ్ళిపోతూ విశ్వామిత్రుడికి గురుదక్షిణ ఇస్తానని మొండిపట్టు పట్టాడు. విశ్వామిత్రుడు దక్షిణ అవసరం లేదని ఎంత చెప్పినా విన్నాడు కాడు.

"అలా అయితే, ఒక్క చెవి మాత్రం నల్లగా వుండే తెల్లని గుర్రాలు ఎనిమిది వందలు పట్టుకురా!" అన్నాడు విశ్వామిత్రుడు చిరాకుతో.



గాలవుడి ప్రాణం మీదికి వచ్చింది. అతని దగ్గిర చిల్లిగవ్వలేదు. గురువుగారు కోరే గుర్రాలు ఎక్కడ ఉంటాయో తెలీదు. అతను విష్ణుమూర్తిని ధ్యానించాడు.

అంతలో గరుత్మంతుడు వచ్చి, "నన్ను విష్ణువు పంపాడు. ఎక్కడికి కావాలంటే అక్కడికి తీసుకుపోతాను," అన్నాడు.

గాలవుడు సంతోషించి, గరుత్మంతుడి వీపుమీద ఎక్కి తూర్పుగా పొమ్మన్నాడు. గరుత్మంతుడు అతివేగంగా పోతుంటే గాలవుడికి ఏమీ కనిపించలేదు, స్పృహ తప్పిపోతున్నది. "అయ్యో, అంతవేగంగా పోకు. నేను గుర్రాలకోసం వెతుకుతున్నాను," అన్నాడు గాలవుడు.

"ఆ మాట మొదటే ఎందుకు చెప్ప లేదు?" అని గరుత్మంతుడు గాలవుడితో కూడా ఋషభం అనే పర్వతంమీద దిగాడు. శాండిలి అనే తపస్విని వారికి ఆతిథ్యం ఇచ్చింది.

తరవాత గరుత్మంతుడు, "నీకు ముందు ధనం కావాలి: దానితో గుర్రాలు సంపాదించు. ప్రతిష్ఠానపురం ఏలే యయాతి నా మిత్రుడు, గొప్ప ధనికుడు. అతని వద్దకు పోయి ధనం అడుగు," అని గాలవుణ్ణి యయాతి దగ్గరికి తీసుకుపోయాడు.

యయాతి గరుత్మంతుడి ద్వారా గాలవుడి వృత్తాంతం తెలుసుకుని గరుత్మంతుడితో, "మిత్రమా, పూర్వంలాగా నా దగ్గిర ఇప్పుడు ధనంలేదు. అయినా, నా కుమార్తెను మాధవిని ఈ బ్రాహ్మణుడికి స్తాను. ఆమె సహాయంతో ఇతని కోరిక తీరనీ," అని గాలవుడికి మాధవిని ఇచ్చాడు.

"ఈ పిల్ల ద్వారా నీకు కావలసిన గుర్రాలు సంపాదించుకో. నేను పోతాను," అనిగరుత్మంతుడు వెళ్ళిపోయాడు.

తరవాత గాలవుడు మాధవిని వెంట బెట్టుకుని అయోధ్యరాజైన హర్యశ్వుడనే వాడి వద్దకు వెళ్ళాడు. అతను వచ్చిన పని తెలిసి హర్యశ్వుడు, "గాలవ మహర్షీ, పిల్ల సర్వలక్షణ సంపన్నగా ఉన్నది. నా దగ్గర గుర్రాలు అనేకంగానే ఉన్నాయి గాని, నీకు కావలసిన గుర్రాలు రెండు వందలు మాత్రమే ఉన్నాయి," అన్నాడు.

"నన్ను ఈ విధంగా ఇతర రాజులకు కూడా ఇచ్చి, నీకు కావలసిన ఎనిమిది వందల గుర్రాలూ సంపాదించుకో," అని మాధవి చెప్పిన మీదట గాలవుడు ఆమెను

హర్యశ్వుడికి ఇచ్చి రెండు వందల గుర్రాలు తీసుకున్నాడు.

మాధవి వల్ల ఒక కొడుకును కనిన తరవాత హర్యశ్వుడు ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు. తరవాత గాలవుడు మాధవిని తీసుకుని దివోదాసుడు ఏలే కాశీకి వెళ్ళాడు. దివోదాసుడి వద్దకూడా గాలవుడు కోరిన గుర్రాలు రెండువందలే ఉన్నాయి. అతను ఒక కొడుకు పుట్టినదాకా మాధవిని తన భార్యగా చేసుకుని, తరవాత ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు.

అప్పుడు గాలవుడు ఆమెను ఉశీనరుడు ఏలే భోజనగరానికి తీసుకుపోయి, అతనికి కొడుకు పుట్టినదాకా మాధవిని భార్యగా ఇచ్చి, తిరిగి ఆమెను వెంట బెట్టుకుని బయలుదేరాడు. ఉశీనరుడి వద్దకూడా రెండువందల గుర్రాలే ఉన్నాయి.

ఇంకా రెండు వందల గుర్రాలు కావాలి. అవి ఎక్కడ దొరుకుతాయో తెలీదు. అంతలో గాలవుడికి గరుత్మంతుడు ఎదురై, జరిగినదంతా విని, "గాలవా, మిగిలిన గుర్రాల కోసం శ్రమపడకు. ఒక చెవి నల్లగా ఉండే తెల్లని గుర్రాలు ప్రపంచంలో మరి లేవు. మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులు ఈ మాధవినే విశ్వామిత్రుడికి ఇచ్చెయ్యి," అని సలహా ఇచ్చాడు.

గాలవుడు మాధవిని విశ్వామిత్రుడి వద్దకు తీసుకుపోయి, గురుదక్షిణ కింద ఆరు వందల గుర్రాలనూ, మాధవినీ ఇచ్చాడు. విశ్వామిత్రుడుసంతోషంగా స్వీకరించాడు.



నారదుడు ఈ కథచెప్పి, "దుర్యోధనా మొండి పట్టుదల వల్ల గాలవుడు ఇన్ని పాట్లు పడవలసి వచ్చింది. అందుచేత నువ్వు మొండితనం మాని, నీ హితంకోరి చెప్పేవాళ్ళ మాటలు విను," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కృష్ణుడితో, "కృష్ణా, జరుగుతున్నదేదీ నాకు సమ్మతం కాదు, కాని నేను పరాధీనుణ్ణి. ఈ దుర్యోధనుడికి బుద్ధిచెప్పటం మాకెవరికీ సాధ్యం కాలేదు, నువ్వు చెప్పి చూడు," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "దుర్యోధనా, నువ్వు తలపెట్టినది నీ వంటి వారు చేసే పనికాదు, దుర్మార్గులు చెయ్యవలసినది. నీకు సలహా ఇస్తున్న వారి కన్న నువ్వే జ్ఞానివి. పాండవుల సఖ్యం మీకు ధర్మార్థ కామాలనిస్తుంది. యుద్ధం మహా నాశన



కారి. పాండవుల పరాక్రమాన్ని నువ్వు గ్రహించు. నువ్వు వారితో సంధిచేసుకుంటే నీవారంతా సంతోషిస్తారు," అన్నాడు.

భీష్ముడూ, ద్రోణుడూ కూడా కృష్ణుడి మాటలను బలపరిచారు. విదురుడు దుర్యోధనుడితో, "నువ్వు ఏమైనా నాకు చింతలేదు. నేను నీ తల్లిదండ్రులైన గాంధారీ, ధృతరాష్ట్రులను గురించి విచారిస్తున్నాను. నీవంటి కొడుకును కన్నందుకు వాళ్ళు దిక్కులేని వాళ్ళు కాబోతున్నారు," అన్నాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "నాయనా, కృష్ణుడి స్నేహం మనకు అన్నివిధాలా మంచిది. ఈ అవకాశాన్ని జారవిడువకు," అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడికి నచ్చలేదు. అతను కృష్ణుడితో, "అందరూ నన్నే నిందిస్తున్నారు. నువ్వు పాండవ పక్షపాతిగా మాట్లాడావుగాని, ఉభయ పక్షాల బలాబలాలు ఆలోచించి మాట్లాడ లేదు. నేను చేసిన మహాపాపం ఏమిటో నాకు తెలియటం లేదు. పాండవులు ఇష్టపడి జూదమాడి, అరణ్యానికి పోతే అది నా తప్పా? పాండవులు మా మీదికి ఎందుకు యుద్ధానికి పూనుకున్నారు? మా అపరాధం ఏమిటి? నేను ఇంద్రుడికైనా భయపడను. వారు క్షత్రియధర్మంతో యుద్ధానికి వస్తే మేము యుద్ధంలో చావటానికైనా సిద్ధమే. నాకు ఏమీ తెలియనప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వబడింది. నేను బతికి ఉండగా ఆ రాజ్యం వారికి తిరిగి రాదు. సూది మొన మోపినంత భూమి కూడా నేను వారికి ఇయ్యను," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "నీ కోరిక చేత నీకు వీరమరణం లభిస్తుందిలే! నువ్వు పాండవులకు అన్ని విధాలా ద్రోహం చేసి ఏ తప్పూ చెయ్యలేదంటున్నావు. నీకు పతనం తప్పదు. మంచిగా అడుగుతుంటే పాండవుల తండ్రిరాజ్యం పాండవుల కియ్యవు. రేపు వారు మొత్తం రాజ్యం తీసుకుంటారు," అన్నాడు.

దుర్యోధనుడు కోపంతో సభనుంచి వెళ్ళిపోయాడు. అతని పక్షం వారంతా అతని వెంట వెళ్ళిపోయారు.

అప్పుడు కృష్ణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, వంశ నాశనం కాకుండా చూడాలంటే పెద్దలందరూ, దుర్యోధనుడు

మొదలైన వారిని బంధించి పాండవుల వశం చేసి, వారితో సంధి చేసుకోండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటకు కంగారు పడి దుర్యోధనుడికి గాంధారిచేత చెప్పించి చూశాడు. ప్రయోజనం లేకపోయింది.

కృష్ణుడు దుర్యోధనుణ్ణీ, అతని మంత్రులనూ బంధించి పాండవులకు అప్పగించబోతున్నట్టు దుశ్శాసనుడు దుర్యోధనుడితో చెప్పాడు. "మనమే ముందుగా కృష్ణుణ్ణి బంధించి, పాండవులను కోరలు తీసిన పాముల్లాగా చేద్దాం," అన్నాడతను.

ఈ సంగతి సాత్యకి ఎలాగో పసికట్టాడు. అతను కృతవర్మతో, "నేను కృష్ణుడితో ఈ సంగతి చెప్పివస్తాను. నువ్వు ఈలోపల మన సైనికులతో సభాద్వారం దగ్గర సిద్ధంగా ఉండు," అని చెప్పి, సభలోకి వెళ్ళి కృష్ణుడితో అతన్ని కట్టెయ్యటానికి దుష్టచతుష్టయం ప్రయత్నించబోతున్నట్టు చెప్పాడు. తరవాత అతను ఇదే సంగతి ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ చెప్పి, సభలో ఉన్నవారందరికీ చెప్పాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి సభకు పిలిపించి చీవాట్లు పెట్టాడు. విదురుడు కూడా అతన్ని మందలించాడు. కృష్ణుడు అతనితో, "నేనిక్కడ ఒంటరిగా ఉన్నాననా నీ ఉద్దేశం? నా వెంట సమస్త పాండవ సేనా, అంధక వృష్టియోధులూ, ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ, ఋషులూ ఉన్నారు, చూడు!" అన్నాడు.

మరుక్షణం కృష్ణుడి శరీరమంతటా అందరూ అంగుళం ప్రమాణంలో మెరుపుల్లాగా ప్రకాశిస్తూ, మంటలు కక్కుతూ కనిపించారు. కృష్ణుడి నుదుట బ్రహ్మ, వక్షస్థలాన ఏకాదశ రుద్రులూ, భుజాలలో దిక్పాలకులూ, ముఖాన అగ్నీ కనిపించారు.

ఆ ఘోరరూపాన్ని చూడలేక సభలో అందరూ కళ్ళుమూసుకున్నారు. కృష్ణుడు దివ్యదృష్టి ఇవ్వటం చేత ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ, సంజయుడూ ఆ విశ్వరూపాన్ని చూడగలిగారు.

"ఈ కలకలం ఏమిటి?" అని ధృతరాష్ట్రుడు అడిగాడు. కృష్ణుడు ధృతరాష్ట్రుడికి కూడా దివ్యదృష్టి ఇచ్చాడు.





# కొయ్యకత్తి

ఒక రాజుగారి దగ్గిర పతంగుడనే యువకుడు సేవకు కుదిరాడు. వాడు సైనిక శిక్షణ పొందినవాడు, చురుకైన వాడుగా కనబడ్డాడు. అయితే వాడికింకా సైనికుడుగా పనిచేసే వయసు లేదు. అందుచేత రాజుగారు వాణ్ణి ప్రస్తుతానికి రాజభవన ద్వారాలలో ఒకదాని వద్ద రాత్రి కాపలాకు గాను ఏర్పాటుచేశాడు.

ఒక రాత్రివేళ రాజుగారు నిద్రలేచి కాపలావాళ్ళు సరిగా పనిచేస్తున్నదీ లేనిదీ చూడటం, అప్పుడప్పుడూ జరిగేది. ఒక రాత్రి ఆయన అలాగే తిరుగుతూండగా పతంగుడు తన కత్తి పక్కన పెట్టి, గోడ నానుకుని నిద్రపోతున్నాడు. కొత్తగా చేరిన వాడు తన విధిని అంత అలక్ష్యం చెయ్యటం రాజుగారు సహించలేక పోయాడు; పట్టరాని ఆగ్రహం వచ్చింది. వాణ్ణి లేవగొట్టి నాలుగు చీవాట్లు పెట్టడానికి బదులుగా వాణ్ణి నలుగురిలోనూ కఠినంగా శిక్షించ నిశ్చయించి, రాజుగారు వాణ్ణి లేపక, వాడి ఒరనుంచి కత్తి మాత్రం తీసుకుని భవనానికి వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి పతంగుడు లేచి తన కత్తి కోసం చెయ్యి చాచాడు. ఖాళీ ఒర మాత్రమే ఉన్నది. పహరావాడు తన కత్తిని పోగొట్టుకోవటం పెద్ద నేరం. అందుకు తల తీసెయ్యవచ్చు. పహరావాళ్ళ దగ్గిర ఉండేవి ప్రత్యేకమైన కత్తులు. అవి ఎక్కడా దొరకవు. వాటిని ఆయుధాగారం నుంచి పహరావాళ్ళకు ఇస్తారు. ఉద్యోగం చాలించుకున్న పహరావాళ్ళు వాటిని ఆయుధాగార రక్షకుడికి తిరిగి ఇచ్చెయ్యాలి. తెల్లవారి సూర్యోదయమయ్యే వేళకు పహరా మారినప్పుడు రాత్రి కాపలావాళ్ళంతా రాజుగారి దగ్గర కనబడి ఇళ్ళకు పోవాలి. అందుచేత పతంగుడు తెల్లవారే లోపుగా ఒక కత్తి సంపాదించాలి. లేకపోతే పీక తెగిపోతుంది.

రాజభవనం సమీపంలోనే పతంగుడికి ఒక వడ్రంగి మిత్రుడున్నాడు. పతంగుడు అతని దగ్గిరికి వెళ్ళి, తన ప్రాణం మీదికి వచ్చిందని జరిగిన సంగతి అతడికి చెప్పాడు.

"పెద్ద కష్టమే వచ్చిపడింది నీకు. కాని నేను మాత్రం ఏం చెయ్యగలను? కొయ్య కత్తి ఒకటి చేసి ఇస్తాను. పైకి కనిపించేది పిడి మాత్రమే గనక, దాన్ని జాగ్రత్తగా తయారుచేస్తాను. ఈపూట గండం గడిచాక, రేపు నీ కత్తి ఎవరో ఎత్తుకుపోయారని రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేసి, కొత్త కత్తి అడిగి పుచ్చుకో," అన్నాడు వడ్రంగి.

అతను తెల్లవారే లోపల ఒక చిన్న కొయ్యకత్తి చేసి ఇచ్చాడు. దాని పిడి మాత్రం చాలా పనితనంగా, అసలు కత్తి పిడిలాగే తయారుచేశాడు.

సూర్యోదయం వేళ మిగిలిన పహరా వారందరితో బాటు పతంగుడు కూడా సోల్పులో నిలబడ్డాడు. కొద్ది సేపటికి రాజు గారు అక్కడికి వచ్చాడు. సాధారణంగా ఆయన పహరా తనిఖీకి ఒంటరిగానే వచ్చే వాడు. కాని ఈసారి ఆయన వెంట నలుగురు రాజభటులు ఒక బంధించిన ఖైదీని తెచ్చారు.

రాజుగారు పహరావాళ్ళకా ఖైదీని చూపించి, "వీడు రాజద్రోహి, వీడికి మరణదండన విధించాను. ఆ శిక్ష నాకళ్ళ ఎదటే జరగాలని ఇక్కడికి తెప్పించాను," అంటూ పహరా వాళ్ళందరి కేసి ఒకసారి చూసి, పతంగుడి మీద కొంచెం సేపు దృష్టి నిలిపి, "నువ్వు వచ్చి, నీ కత్తితో ఈ దుర్మార్గుడి తల నరికెయ్యి," అన్నాడు.





స్వయంగా బలహీనుడే అయినప్పటికీ, దుష్టుడు ప్రజలకు హానిచేయడానికి ఎదుటివారిని రెచ్చగొట్టగలడు. సానరాయి స్వతహాగా నరకలేకపోయినప్పటికీ, కత్తికి పదునెక్కిస్తుంది కదా!
—సుభాషిత రత్నభాండాగారం

పతంగుడికి అకస్మాత్తుగా గుండె ఆగిపోయినట్టయింది. వాడి దగ్గర ఉన్న కొయ్యకత్తి తలలు నరకదు సరికదా, దాన్ని ఒరనుంచి పైకి తీస్తే, అది అసలు కత్తి కాదన్న సంగతి కాస్తా బయటపడి, పతంగుడి తలకే ఎసరువస్తుంది!

"మహారాజా, నన్ను క్షమించి ఈ పని మరెవరికైనా ఇవ్వండి," అన్నాడు వాడు కంగారుపడుతూ.

"ఎందుకలా కంగారుపడుతున్నావు? నా ఆజ్ఞ ధిక్కరిస్తావా?" అన్నాడు రాజు.

"అది కాదు, మహారాజా! నేను సైనికుణ్ణి,తలారిపని చెయ్యటం నాకు సాధ్యం కాదు. యుద్ధరంగంలో శత్రువును చంపగలను కాని, బంధించి ఉన్న నిరాయుధుడి తల నరకలేను," అన్నాడు పతంగుడు.

"అది పాపమైతే ఆ పాపం నాదే. ఆజ్ఞ నిర్వర్తించకపోయావో నీకు మరణదండన విధిస్తాను," అన్నాడు రాజు భరించరానంత కోపంగా.

పతంగుడు కళ్లు మూసుకుని, చేతులు జోడించి, "తల్లీ భవానీ, నన్నీ ఆపద నుంచి నువ్వేకాపాడాలి. నేను చేసేది నేరమయ్యే పక్షంలో నాకత్తిని కొయ్యకత్తిగా మార్చెయ్యి!" అంటూ ఒర నుంచి కత్తి పైకి లాగాడు. కత్తి పిడి కింద జానెడు పొడుగు కొయ్య కత్తి మాత్రమే ఉన్నది.

పహరావాళ్ళంతా గొల్లున నవ్వారు. రాజుగారికి కూడా నవ్వాగలేదు. ఆయన పతంగుడి తప్పు క్షమించి, వాడి యుక్తికి మెచ్చుకుని వాణ్ణి పహరా నుంచి తీసేసి, తన అంగరక్షకుడుగా వేసుకున్నాడు.






# కల-నిజం

రాముడూ, భీముడూ, కృష్ణుడూ అనే ముగ్గురు యువకులూ, ఒకే ఊరివాళ్ళు. వింతగా ముగ్గురికీ పెళ్ళిళ్ళ విషయంలో, కొద్దిపాటి తేడాలో ఒకే రకమైన సమస్య ఎదురైంది. రాముడూ, గౌరి అనే అమ్మాయీ పెళ్ళి చేసుకుందామనుకున్నారు. కానీ ఆమె తల్లి దండ్రులు, ఎంతో అందగత్తె అయిన తమ కూతుర్ని పెళ్ళాడేందుకు ఎందరో ధనిక యువకులు సిద్ధంగా వుండగా, పేదవాడైన రాముడితో ఆమె పెళ్ళి జరగదని ఖచ్చితంగా చెప్పేశారు.

భీముడిదీ పెళ్ళి సమస్యే. వాడికీ కమల అనే అమ్మాయికీ ఒకరంటే ఒకరికి యిష్టం. కానీ కమల తల్లిదండ్రులు వాణ్ణి ఇల్లరికం రమ్మన్నారు. భీముడి తల్లి దండ్రులు వృద్ధులు. వాళ్ళు పూర్తిగా భీముడిపై ఆధారపడి బతుకుతున్నారు. ఇప్పుడు వాడు ఇల్లరికం పోతే, వాళ్ళు దిక్కులేని వాళ్ళవుతారు. అందువల్ల, వాడు ఇల్లరికానికి ఒప్పుకోలేదు.

కృష్ణుడికి నా అన్నవాళ్ళు లేరు. తెలివైనవాడు, మంచి అందగాడు. గజపతి అనే కర్కోటకుడి వద్ద బానిసలా పని చేస్తున్నాడు. అదృష్టమో, దురదృష్టమో గజపతి కుమార్తె స్వాతి వాణ్ణి పెళ్ళాడతానన్నది. కూతుర్ని ఏమీ అనలేక గజపతి, కృష్ణుడికి ఒక షరతు పెట్టాడు. వాడు రోజూ నూరు వరహాలు సంపాయించి తేవాలి! ఇది ఏమాత్రం సాధ్యపడేది కాదని కృష్ణుడు నిరాశచెందాడు.

ఒకనాడు రాముడు, భీముడు, కృష్ణుడు ఒకరి కష్టాలొకరికి చెప్పుకున్నారు. కొంతసేపు తర్కించుకున్న మీదట తమ కష్టాలన్నింటికీ మూలకారణం డబ్బని వాళ్ళకు తోచింది. డబ్బుంటే అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయి. కానీ ఆ

"వసుంధర"



డబ్బు సంపాయించడం తమవల్ల కాదు. కాబట్టి ఆత్మహత్య చేసుకోవాలని ముగ్గురూ నిర్ణయించుకున్నారు.

ఆ ఊరి పొలిమేరలో పెద్ద కొండ వున్నది. ఒక రాత్రి పూట ముగ్గురు మిత్రులూ కలిసి, ఆ కొండ ఎక్కి శిఖరాన్ని చేరుకుని, కళ్ళు మూసుకుని, "భగవంతుడా! వచ్చే జన్మలోనైనా మమ్మల్ని ధనవంతులుగా పుట్టించు!" అంటూ అక్కణ్ణించి దూకబోయారు.

అప్పుడు వాళ్ళకు, "ఆగండి, నాయనలారా!" అన్న హెచ్చరిక వినబడింది.

ముగ్గురూ కళ్ళు తెరిచి వెనక్కు తిరిగి చూస్తే, ఒక బైరాగి కనిపించాడు. ఆయన వాళ్ళనడిగి కారణం తెలుసుకుని, "భగవంతుడు మనకిచ్చిన వరం ఈ జీవితం. దీన్నిలా అర్థాంతరంగా అంతం చేయడం మహాపాపం. ఇలా చేయడం వల్ల వచ్చే జన్మలో ధనవంతులు కావడం సంగతటుంచి, ముందు సరాసరి నరకానికి పోతారు. ఆత్మహత్యపాతకానికి కఠిన శిక్షలనుభవిస్తారు. ఆ తర్వాత భూమ్మీద మరింత నికృష్టమైన జన్మలో అవతరిస్తారు," అని చెప్పాడు.

మిత్రులు ముగ్గురూ కలవరపడి, "మాకు జీవితంపై విరక్తి కలిగింది. ఇప్పుడు మేమేం చేయాలో తమరే చెప్పండి," అని బైరాగిని కోరారు.

"ప్రతిరోజూ దైవప్రార్థన చేయండి. అన్నింటికీ భగవంతుణ్ణే పూర్తిగా నమ్ముకుని, మానవ ప్రయత్నంగా మీ కృషి చేయండి. శుభమవుతుంది," అని బైరాగి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఇంటిదారి పట్టిన ముగ్గురు మిత్రులకూ, ఒక గుబురు మీసాల వాడు ఎదురయ్యాడు. వాడు ముందు వాళ్ళను ఎగాదిగా చూసి, ఆగి అడిగి వాళ్ళ కథ తెలుసుకుని, గలగలా నవ్వి, "తొందరగా డబ్బు సంపాయించే మార్గం నేను చెబుతాను. నాతో రండి," అన్నాడు.

రాముడు, భీముడు, కృష్ణుడు మారు మాట్లాడకుండా, వాడి వెంట వెళ్ళారు. వాడు, వాళ్ళను అరణ్యం మధ్యలో వున్న తన స్థావరానికి తీసుకువెళ్ళి, ముగ్గురికీ మంచి తీర్థం యిచ్చాడు.

అది తాగిన వెంటనే ముగ్గురూ స్పృహతప్పి పడిపోయారు.

అప్పుడు రాముడికొక కలవచ్చింది. ఆ కలలో వాడు రాజకుమారుడైపోయాడు. గౌరి తల్లిదండ్రులు వెతుక్కుంటూ వచ్చి గౌరితో వాడికి వివాహంజరిపించారు. వాడికి జీవితం రంగరంగ వైభోగంగా గడిచి పోతున్నది.

భీముడిక్కూడా ఒక కల వచ్చింది. కమల తల్లిదండ్రుల నెదిరించి తన ఇంటికి వచ్చేసి, తనను వివాహం చేసుకున్నది. అత్తమామలను కన్నకూతురులా చూసుకోసాగింది. భీముడికి స్వర్గంలో వున్నట్లుంది.

కృష్ణుడి కలలో గజపతి వాడిని ఇంటల్లుణ్ణి చేసుకున్నాడు. స్వాతినీ, వాణ్ణీ సుఖంగా జీవించమని, ఇంటిపనులన్నీ తను చూసుకోసాగాడు. ఇలాంటి వైభోగం ఇంద్రుడిక్కూడా వుండి వుండదన్న భావం కృష్ణుడిలో కలిగింది.

స్పృహవచ్చాక రాముడు, భీముడు, కృష్ణుడు ఒకరికలలొకరికి చెప్పుకున్నారు.

ఆసమయంలో గుబురు మీసాల వాడు, వాళ్ళవద్దకు వచ్చి, "అబ్బాయిలూ! నేను మీకు మంచితీర్థంలో మాదకం అనే అద్భుతమైన ఔషధం కలిపి యిచ్చాను. ఆ ప్రభావంతోనే మీకిలాంటి కలలు వచ్చాయి. ఈ ఔషధం మాదకం మొక్కల పూలనుంచి తయారు చేశాను. ఇక్కడ మాదకం తోట వున్నది. అందులో పనిచేయడానికి మనుషులు కావాలి. మీరొప్పుకుంటే, మిమ్మల్నాపనిలో పెట్టుకుంటాను. పట్నంలో ఈ మాదకానికి



ఎంతో గిరాకీ వున్నది. సుఖసంతోషాల కోసం ఎందరో ఈ మాదకాన్ని ఎంత డబ్బయినా యిచ్చి కొంటారు. నావద్ద పని చేస్తే ఒక్క నెలలో మీరు ఒక్కొక్కరూ లక్ష వరహాలు సంపాయించుకోవచ్చు," అన్నాడు.

అంతేకాక, ప్రతిరోజూ మాదకం కలిపిన మంచితీర్థం యిస్తానని వాడు, వాళ్ళకు ఆశచూపాడు.

రాముడు, భీముడు,కృష్ణుడు ఎంతో సంతోషించి సరేనన్నారు. నలుగురూ కలిసి మాదకవనం కేసి కొంత దూరం వెళ్ళేంతలో ఎక్కడినుంచో ఒక నల్లత్రాచు బుస్సుమంటూ కృష్ణుణ్ణి కాటేసి పారిపోయింది. ఇది చూసి గుబురు మీసాలవాడు ఎంతో ఆశ్చర్యపడి, "ఎన్నో ఏళ్ళుగా ఇక్కడుంటున్నాను. ఇలా



ఎన్నడూ జరగలేదు. సరే, ఇక్కడికి దగ్గర్లో ఒక ఆశ్రమం వున్నది. కృష్ణుడికి వైద్య సహాయం అక్కడే లభిస్తుంది," అన్నాడు.

తర్వాత వాడు దారి చూపించగా అందరూ ఆశ్రమం చేరుకున్నారు. గుబురు మీసాలవాడు, తను ఆశ్రమంలోకి రాననీ, కృష్ణుడికి నయమయ్యాక, ముగ్గుర్నీ కలిసి తన వద్దకు రమ్మనీ చెప్పి వెళ్ళిపోయాడు.

అప్పటికి కృష్ణుడికి పూర్తిగా స్పృహ తప్పింది. వాణ్ణి తీసుకుని ఆశ్రమంలోకి వెళ్ళిన రాముడికీ, భీముడికీ బైరాగి కనిపించాడు. ఆ ఆశ్రమం ఆయనదేనని తెలిసి, వాళ్ళు ఆశ్చర్యపడ్డారు. బైరాగి తన వద్ద వున్న ఔషధాలతో కృష్ణుడిలో ప్రవేశించిన విషాన్ని విరిచివేశాడు. కొద్ది సేపటికి కృష్ణుడు మామూలు మనిషయ్యాడు.

అప్పుడు బైరాగి వాళ్ళను, "మీరు మీ ఇళ్ళల్లో ఉండాల్సింది కదా! అడవిలోకి ఎందుకొచ్చారు?" అని అడిగాడు.

జరిగినదంతా వాళ్ళు చెప్పారు.

"అయితే, ఇప్పుడేం చేద్దామనుకుంటున్నారు?" అని ప్రశ్నించాడు బైరాగి.

తాము గుబురు మీసాల వాడివద్ద చేరి, మాదకాన్ని సేవిస్తూ సుఖంగా ధన సంపాదన చేయాలనుకుంటున్నట్లు వాళ్ళు, బైరాగికి చెప్పారు.

"ఇంకా తెల్లవారడానికి కాస్త వ్యవధి వున్నది. మీరు కాసేపు విశ్రమించండి. రేపు మీకు జ్ఞానబోధ చేస్తాను," అన్నాడు బైరాగి.

ముగ్గురు మిత్రులూ నిద్రపోయి లేచేసరికి, బాగా బారెడు పొద్దెక్కింది. వాళ్ళు కాలకృత్యాలు తీర్చుకున్నాక బైరాగి వాళ్ళ వద్దకు వచ్చి, "నాయనలారా, మీకిప్పుడు బాగా ఆకలిగా వుండి వుంటుంది. ఏమేం కావాలో చెప్పండి!" అన్నాడు.

ముగ్గురూ కూడా ఉత్సాహంగా తమ కిష్టమైన తినుబండారాల గురించి చెప్పారు. బైరాగి ముగ్గుర్నీ ఒకసారి తన చేతులతో మృదువుగా తాకాడు.

అంతే! ముగ్గురికీ ఒకేసారి స్పృహ తప్పింది. ముగ్గురికీ ఒకేసారి తమకిష్టమైన తినుబండారాలన్నీ తింటున్నట్లు కల వచ్చింది. కలలో తినడం పూర్తయ్యాక వాళ్ళు మేలుకున్నారు.

అప్పుడు బైరాగి, ముగ్గురికీ తలొక జామపండు యిచ్చి, "ప్రస్తుతానికి వీటితో మీ ఆకలి తీర్చుకోండి," అన్నాడు.

వాళ్ళు పళ్ళు తినడం అయ్యాక ఆయన, "కలలో ఇష్టమైన పదార్థాలు చాలా తిన్నారు. ఇప్పుడు ఒక్క జామపండు మాత్రమే తిన్నారు. ఏది మీకు ఎక్కువ తృప్తి నిచ్చింది?" అని అడిగాడు.

రాముడు, "కలలో ఏం జరిగినా ఊహ మాత్రమే! ఊహలో కలిగే అనుభవం లాగే ఆనందం కూడా అవాస్తవం. నిజమైన అనుభవమే నిజమైన సంతోషాన్నీ, తృప్తినీ యిస్తుంది. సందేహం లేదు," అన్నాడు.

అది విన్న బైరాగి ముఖం గంభీరంగా అయిపోయింది. ఆయన మృదువుగా, "నాయనలారా! భగవంతుడు మీకు జీవితాన్నిచ్చాడు. మీరు కనే కలలు వాస్తవాలుగా మార్చుకునేందుకు మెదడు యిచ్చాడు. మీమీ అదృష్టాలను బట్టి కొన్ని కలలు వాస్తవాలవుతాయి. కొన్ని కావు. కానీ మాదకం అనేది విషప్రాయం. అది జీవితాన్ని కలగా మార్చుతోంది. ఆ కలలో మీరెన్ని సుఖాలనుభవించినా, అవి వాస్తవాలు కాలేవు. అటువంటి మాదకాన్ని మీరు సేవించడమే కాక, గుబురు మీసాల వాడికి దాన్ని పండించడంలో సాయపడి, ఎందరి జీవితాలనో నాశనం చేయాలనుకుంటున్నారు. తక్కువ సుఖాలతో ఆరోగ్యకరమైన జీవితం కావాలో, అనారోగ్యకరమైన శరీరంతో ఎక్కువ సుఖాల కలలు కావాలో, మీరే నిర్ణయించుకోండి," అన్నాడు.

రాముడు, భీముడు, కృష్ణుడు ముఖముఖాలు చూసుకున్నారు. గుబురు మీసాలవాడు ప్రజాద్రోహి అని అప్పటికి వాళ్ళకు అర్థమయింది. ముగ్గురూ ఏక కంఠంతో, "జీవితంలో అనుభవం ఎంత చిన్నదైనా ఆనంద కారణమవుతుంది. అలాంటి జీవితాన్ని మాకిచ్చిన భగవంతుడికి సర్వదా కృతజ్ఞులం. మాకు నిజం కావాలి, కలవద్దు. కలలనిచ్చే మాదకమూ వద్దు!" అని బైరాగితో చెప్పారు.

బైరాగి వాళ్ళను మెచ్చుకుని, "ప్రతి మనిషి నుంచీ ఇలాంటి మంచి ఆలోచనలే, భగవంతుడు కోరేది! ఇక మీరు వెళ్ళవచ్చు," అన్నాడు.



# కనుగొనండి, రాయండి,

ఈ సంచికలో ప్రచురించిన ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రకటించబడతాయి. అదేసమయంలో మీరు కూడా భారతదర్శనం పోటీకి సమాధానాలు పంపవచ్చు. అయితే, ఎంట్రీలు పంపడానికి మీరు కొంత సృజనాత్మక కృషిచేయాలి. గత సంచికలోని కథలను క్షుణ్ణంగా చదవండి. ఆ కథలలో మీకు బాగా నచ్చిన కథను తెలియజేస్తూ ఆ కథ ఎందుకు మీకు నచ్చింది? అన్న దానిని వివరిస్తూ ఇరవై వాక్యాలకు మించకుండా చిన్న వ్యాసం రాసి, మీ సమాధానాలకు జతచేయాలి. మీ వయస్సు, విద్యార్థి(ని) అయినట్టయితే మీరు చదువుతూన్న తరగతి/ విద్యాసంస్థ పేరు; మీ పూర్తి చిరునామా రాసి, సమాధానాల చివర మీరు సంతకం చేయాలి. మీ సంతకాన్ని ధృవపరుస్తూ, మీ ఉపాధ్యాయులు లేదా మీ తల్లితండ్రులలో ఎవరో ఒకరు, సంతకం చేయాలి. సమాధానాలను **భారతదర్శనం పాఠకులకు పోటీ, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026** చిరునామాకు పంపాలి.

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | రూ. **1000**/- | ఇంకా ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కటి రూ. **200**/- |
| రెండవ బహుమతి | రూ. **500**/- | |







## భారతదర్శనం పాఠకులకు పోటీ

అదొక తుపాను రాత్రి. ముద్దగా తడిసిన బట్టలతో యువకుడొకడు, నదీతీరంలోని ఒక ఇంటి పెరటి తలుపు తట్టాడు. దీపం పట్టుకుని వచ్చి తలుపు తెరిచిన యువతి అతన్ని చూసి ఆశ్చర్యంతో, ''నువ్వా! అర్ధరాత్రివేళ నదిని దాటి ఇంతదూరం వచ్చావా?'' అని అడిగింది.

''నిన్ను పుట్టినింట వదిలి క్షణంకూడా ఇంటివద్ద నిలువలేకపోయాను,'' అన్నాడు యువకుడు.

''నీ భార్యనైన నాపైన నువ్వు చూపుతూన్న ప్రేమలో సగం దేవుడిమీద చూపినా ఎంతో బావుండేది!'' అన్న దాయువతి మనసులో గొణుక్కుంటున్నట్టు.

ఆ క్షణమే ఆయువకుడి జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. అతని దృష్టి దేవుడి మీదికి మళ్ళింది. క్రమేణా గొప్ప భక్తుడయ్యాడు.

ఇద్దరు భక్తుల జీవితాలలో జరిగిన యదార్థ సంఘటన ఇది అని చెబుతారు. వారెవరో మీకు తెలుసా?

మన పురాణాలలోని ఈ జంట పాత్రల మధ్యవున్న సంబంధం ఏమిటో తెలుసా?




విజ్ఞాన వినోదాల మేలు కలయిక,

# బహుమతులు గెలుచుకోండి!

మామ




1. మొట్టమొదటి భారతీయ వైద్య గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు? ఆయన ఎప్పుడు నివసించాడు?
2. శస్త్రచికిత్సకు సంబంధించిన మొట్టమొదటి భారతీయ గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు? ఆయన ఎప్పటివాడు?
3. మనదేశానికి చెందిన మొట్టమొదటి చారిత్రక గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు? ఏ శతాబ్దానికి చెందినవాడు?
4. మనదేశానికి చెందిన సామాజిక, రాజకీయ, న్యాయశాస్త్ర గ్రంథం ఏది? రచయిత ఎవరు? ఎప్పుడు నివసించాడు?
5. భారతీయ నాటకానికి సంబంధించిన మొట్టమొదటి గ్రంథం ఏది? రచయిత ఎవరు? ఎప్పుడు నివసించాడు?

దర్శనం

కు పోటీ




నిబంధనలు :

1. చందమామ ఇండియా లిమిటెడ్ సంస్థలో ఉద్యోగం చేసే వాళ్ళూ/సంబంధించిన వాళ్ళూ, వాళ్ళ బంధువులూ ఈ పోటీలో పాల్గొనకూడదు.
2. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. దస్తూరీ స్పష్టంగా లేని ఎంట్రీలు స్వీకరించబడవు.
4. పోటీ ఫలితాలు చందమామ మే నెల సంచికలో ప్రకటించబడతాయి.
5. సమాధానాలు ఫిబ్రవరి 29వ తేదీలోగా మాకు చేరాలి.

| | | |
|---|---|---|
| ఎ. అభిమన్యుడు | - | బలరాముడు |
| బి. ఉగ్రసేనుడు | - | ప్రద్యుమ్నుడు |
| సి. ఘటోత్కచుడు | - | శిశుపాలుడు |
| డి. కీచకుడు | - | పరీక్షిత్తు |
| ఇ. కర్ణుడు | - | సుభద్ర |

శ భాషలలో చందమామ ప్రత్యేకత!



# భారతదేశం

నాడు-నేడు



# చెన్నయ్ నగరం

తమిళనాడు రాష్ట్ర రాజధాని పేరు చెన్నయ్‌గా ఇటీవలే వాడుకలోకి వచ్చినప్పటికీ ఇది పాతపేరే. దీనిని తొలి రోజులలో చెన్నపట్టణం అనీ, మద్రాసు పట్టణం అనీ పిలచేవారు. ఒకే నగరానికి రెండు పేర్లు ఎలా వచ్చాయి? అని అడిగితే, దీనికి విభిన్న కారణాలు చెబుతారు.

సముద్రతీరంలో ఈస్ట్ ఇండియా కంపెనీ కోట నిర్మించినప్పుడు అక్కడ చెన్నకేశవస్వామి ఆలయం ఉండేదనీ, దాని పేరు మీదుగానే ఆ ప్రాంతానికి చెన్నపట్టణం అని పేరు వచ్చిందని కొందరు అభిప్రాయపడుతున్నారు. ఈ ప్రదేశంలో మొదట సైనికస్థావరాన్ని ఏర్పాటు చేసిన ఫ్రాన్సిస్ డే—చంద్రగిరి రాజు ప్రతినిధి అయిన దామర్ల వెంకటప్ప నాయకుడి నుంచి ఆ స్థలాన్ని కొన్నాడనీ, ఆ ప్రాంతానికి తన తండ్రి చెన్నప్ప నాయకుడి పేరు పెట్టాలని వెంకటప్ప నాయకుడు షరతు పెట్టాడనీ, అందువల్లే దీనికి చెన్నపట్టణ మనే పేరు వచ్చిందన్నది మరికొందరి అభిప్రాయం.

మదరసా అనే ఒక ఇస్లాం పాఠశాల ఇక్కడ ఉండేదనీ, దాని పేరు మీదే ఈ ఊరికి మద్రాసు అనే పేరు వచ్చిందని కొందరంటే; కాదు, మదరాసన్ అనే ముస్లిం నాయకుడి పేరుమీదుగానే మద్రాసు వచ్చిందని మరికొందరు అంటున్నారు. ఇవన్నీకాదు; ఈ ప్రాంతంలో మదేరా అనే పలుకుబడిగల పోర్చుగీసు కుటుంబం ఒకటి నివసించేది. ఆ కారణంగానే దీనికి మద్రాసు అని పేరు వచ్చిందని వాదించే వారూ ఉన్నారు.

ఢిల్లీ, వారణాశి, మధుర, కంచి మొదలైన నగరాలలాగా చెన్నయ్ పురాతన నగరం కాదు. అయినప్పటికీ దీనికి ప్రాచీన చరిత్రలో ప్రముఖ స్థానం ఉన్నది. దాదాపు రెండు వేల సంవత్సరాలకు పూర్వం 'తిరుక్కురళ్' అనే తమిళ గ్రంథాన్ని రచించిన తిరువళ్ళువర్ ఇక్కడి మైలాపూర్ ప్రాంతంలో నివసించాడు. జాతి, మత, భాషా భేదాలు లేకుండా, ప్రపంచ ప్రజలందరూ వ్యక్తిగత వికాసానికీ, సమాజ ప్రగతికీ ఆచరించతగిన అద్భుత సూక్తులు నిండిన నీతిగ్రంథం తిరుక్కురళ్. అందుకే దీనిని 'తమిళవేదం' అని అంటారు. అటువంటి తమిళవేదానికి జన్మభూమి చెన్నయ్ నగరం!



తిరువళ్ళువర్ భార్య వాసుకి శీలవతి, అనుకూలవతి. ఈనాటికీ వారిని ఆదర్శ దంపతులుగా చెప్పుకుంటారు. వాసుకి ఒకనాడు పెరటి బావిలో నీళ్ళు తోడుతూండగా, వాకిట్లో వళ్ళువర్ ఏదో పనిమీద వుండి భార్యను పిలిచాడు. ఆమె చేదుతూన్న చేదను అలాగే వదిలి భర్త దగ్గరికి వచ్చింది. ఆమె భర్త చెప్పిన పని ముగించు



కుని వెళ్ళేవరకు, గిలక మీద చేతాడుతో వున్న బిందె బావిలోపడి మునిగిపోకుండా వదిలినది వదిలినట్టు అలాగే నిలిచి వుందట! జీవితాన్ని ధర్మమార్గంలో సాగించేవారికి, మహిమలు, అద్భుతాలు వాటంతట అవే జరుగుతాయని చెప్పడానికి ఈ సంఘటనను చెప్పుకుంటారు.

ఏసుక్రీస్తు శిష్యులలో ఒకడైన సెయింట్ థామస్ క్రీ.శ. 52వ సం॥లో మనదేశానికి వచ్చాడు. ఆఖరికి ఆయన మద్రాసు చేరుకుని నగర శివార్లలోని ఒక చిన్న కొండ మీద మరణించాడు. అందువల్లే దానికి సెయింట్ థామస్ మౌంట్ అనే పేరు వచ్చింది. ఆయన భౌతిక కాయాన్ని సమాధి చేసిన శాంథోమ్ కెథడ్రల్ కూడా ప్రసిద్ధమైనదే!

పదిహేడవ శతాబ్దంకల్లా చెన్నయ్‌లో బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ కార్యకలాపాలు ప్రారంభమయ్యాయి. వర్తకులు సముద్రతీరంలో వెదురు పాకలలో నివసించే వారు. ఆ స్థలంలోనే తరవాత సెయింట్ జార్జ్ కోటను నిర్మించారు. ఆ కోట ఆవరణలోనే ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యాలయం పనిచేస్తున్నది. మైలాపూర్‌లో కపాలీశ్వర ఆలయం; తిరువల్లిక్కేణిలోని పార్థసారథి ఆలయం చాలాపురాతనమైనవి; ప్రసిద్ధమైనవి.

చెన్నయ్ అడయార్‌లో అంతరాత్జీయ దివ్యజ్ఞాన సమాజం (ఇంటర్నేషనల్ థియోసాఫికల్ సొసైటీ) ప్రధాన కార్యాలయం ఉన్నది. ఒకప్పుడు థియోసాఫికల్ సొసైటీ ప్రెసిడెంటుగా వున్న డా. జి. ఎస్.అరుండేల్ సతీమణి శ్రీమతి రుక్మిణీ అరుండేల్ నృత్య సంగీతాలు నేర్పే కళాక్షేత్ర అనే కళానిలయాన్ని స్థాపించారు.

సముద్రతీరంలోని ఈనాటి చెన్నయ్ నగరం జనాభా దాదాపు యాభై లక్షలు. నగరంలో దేశంలోనే మొట్టమొదటి నేత్ర వైద్యశాల వుంది. మొట్టమొదటి స్నేక్(పాముల) పార్క్, క్రొకొడైల్ (మొసళ్ళ)పార్క్‌లు ఉన్నాయి. ఇక్కడి 12 కి.మీ. పొడవైన మెరీనాబీచ్ చాలా అందమైనది. ఇది ప్రపంచంలోనే రెండవ పొడవైన సముద్రతీరంగా ప్రసిద్ధి గాంచింది. అమెరికాలోని కాలిఫోర్నియా లాంగ్ బీచ్ తరవాత మెరీనా బీచ్‌ని చెప్పుకుంటారు.



చెన్నయ్ చుట్టూ పాతవీ కొత్తవీ చాలా పర్యాటక స్థలాలు ఉన్నాయి. నగరానికి దక్షిణంగా మహాబలిపురంరోడ్‌లో చోళమండల్ చిత్రకారుల కాలనీ వుంది. దీనికి మరికొంత దూరంలోనే ప్రాచీన శిల్పకళా వైభవానికి నిలయమైన మహాబలిపురం అనే మామల్లపురం ఉన్నది. ఇక్కడి అరుదైన ఏకశిలా రథాలు, అద్భుతమైన శిల్పకళాఖండాలు చూపరులకు ఆనందాశ్చర్యాలు కలిగిస్తాయి.

చెన్నయ్‌లో అనేక విశ్వవిద్యాలయాలు, ఆధునిక కళాశాలలు, జాతీయ గ్రంథాలయం, ఆర్ట్‌గ్యాలరీ, వళ్ళువర్‌కోట్టం, పెద్ద వస్తు ప్రదర్శనశాల, జంతుప్రదర్శనశాల, చక్కటి ఉద్యానవనాలు మొదలైనవి చాలా ఉన్నాయి. ఈ నగరం చిత్రపరిశ్రమకు సంబంధించిన కార్యకలాపాలకు కూడా ముఖ్యకేంద్రం. ఈనాడు దక్షిణ భారత దేశంలో అతిపెద్ద నగరం చెన్నయ్!






# ఈ శతాబ్దపు చివరి వలసపాలిత ప్రాంతం

హింసాయుతంగానో, అహింసామార్గంలోనో ఉద్యమం సాగించకుండా ఏ వలసపాలిత ప్రాంతం స్వాతంత్ర్యం సాధించింది? కేవలం తిరుగుబాటు కూడా జరపకుండా ఏ ప్రాంతం పరాయిపాలన నుంచి విముక్తి పొందింది? అని ప్రశ్నించినట్టయితే మకావో అని సమాధానం చెప్పవచ్చు. చైనాకు చెందిన ఒక చిన్న దీవి మకావో. గత 4,42 సంవత్సరాలుగా దీనిని పోర్చుగీసులు పాలిస్తూ వచ్చారు. అది ఆసియా, యూరపు ఖండాల మధ్య వాణిజ్య కేంద్రంగా అభివృద్ధి చెందింది. దానిద్వారా ఎక్కువ ప్రయోజనం పొందే దేశం చైనా. అసంఖ్యాకమైన రకరకాలచీనావస్తువులు మకావో గుండా యూరపు చేరుకుంటాయి.

భారతదేశానికి చెందిన గోవా కూడా పోర్చుగీసు వలసపాలిత ప్రాంతంగానే ఉండేది. భారతదేశం దానిని బలవంతంగా విడిపించవలసి వచ్చింది. అయితే, ఇటీవలి కాలంలో ఎంతో మార్పు వచ్చింది. పోర్చుగల్ తానంతటతాను తన వలస ప్రాంతాన్ని చైనాకు అప్పగించింది. చైనా మాత్రం దానిని తిరిగిపొందడానికి తొందరపడలేదు.

ఇరవైయవ శతాబ్దంలో ప్రపంచ వ్యాప్తంగా వలస రాజ్యాలన్నీ పతనమవుతూ వచ్చాయి. అలా ఈ శతాబ్దం చిట్టచివర విముక్తి పొందిన ప్రాంతం–4,36,000 జనాభా గల మకావోదీవి. డిసెంబర్ 19వ తేదీ అర్ధరాత్రి సమయంలో ఈ మార్పు జరిగింది: మకావో భద్రతాదళానికి చెందిన నలుగురు అధికారులు పతాకను మడిచి, పోర్చుగీసు గవర్నర్ వాస్కో రోచా వీయ్‌రాకు అందించారు. ఆయన దానిని తన వక్షస్థలానికి తాకించి 1991వ సం॥నుంచి తన కార్యాలయంగా వున్న ప్రభుత్వ భవనాన్ని ఒక్కసారి తేరిపార చూశారు. గవర్నర్ ఆ పతాకను లిస్బన్‌కు తీసుకువెళ్ళి-మకావో సాంస్కృతిక పరిశోధనా సంస్థలో ప్రదర్శనకు పెడతారని, పోర్చుగీసు ప్రతినిధి తెలియజేశారు.

ఈ పరిణామాన్ని గురించి పోర్చుగల్ గవర్నర్ జార్జ్ సాంపాయియో ఇలా అన్నారు: 500 సంవత్సరాల చరిత్ర కొన్ని క్షణాలలో నా మనోనేత్రాల ముందు కదిలి వెళ్ళినప్పుడు ఒక్కసారిగా విభిన్న భావాలు నాలో కలిగాయి.

మార్పులు జరిగే తీరు అంతే!





# ఈ శతాబ్దం కానుక (?)






ఒకప్పుడు గొప్ప అద్భుతాలనుకునేవి, కాలం గడిచేకొద్దీ మామూలు విషయాలుగా మారిపోతాయి. 1914వ సం॥లో పనామా కాలువను ప్రారంభించినప్పుడు, దానిని చరిత్రలో ముఖ్యఘట్టంగా కొనియాడారు. పనామా దేశం గుండా యాభై మైళ్ళు ప్రవహించే ఈ కాలువ – పసిఫిక్ మహాసముద్రాన్నీ, అట్లాంటిక్ మహాసముద్రాన్నీ కలుపుతున్నది. ఈ కాలువను తవ్వడంలో దాదాపు ఆరువేల మంది శ్రామికులు తమ ప్రాణాలు కోల్పోయారు. ఈ కాలువ, న్యూయార్క్– శాన్ ఫ్రాన్సిస్కో నగరాల మధ్య దూరాన్ని 8,000 మైళ్ళు తగ్గించింది. ఈ కాలువ కారణంగా ఉభయ నగరాల మధ్య సరకుల రవాణా సమయం దాదాపు వందరెట్లు తగ్గింది.

అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ రూపకల్పన మేరకు పనామా కాలువ తవ్వకం జరిగింది. రూజ్వెల్ట్ స్వయంగా ఈ కాలువ గుండా ఓడలో ప్రయాణం చేశాడు. అంతకు ముందెన్నడూ అధికారంలో వున్న అమెరికా అధ్యక్షులెవ్వరూ దేశాన్ని వదిలి వెళ్ళలేదు!

ఈనాడు పరిస్థితులు మారాయి. ఇంత కాలం, కాలువపై అమెరికా దేశానికే అధికారం ఉండేది. నిజానికి అది అమెరికా ఆస్తి. పనామా గట్టుకు ఇరువైపులా చిన్న చిన్న అమెరికా వలస ప్రాంతాలు వెలిశాయి. అక్కడ అమెరికాదేశస్థులు, తుపాకీలు పేల్చడం, ఆయుధ సామగ్రిని పరిశోధించడం వంటివి చేసేవారు. అలాంటి ప్రేలుళ్ళు ముందు హెచ్చరిక లేకుండా జరిపినప్పుడు అడవిలో కట్టెలు కొట్టే పలువురు స్థానికులు చనిపోయారు. ఈ దుందుడుకు చర్యకు పనామా ప్రజలు తీవ్ర నిరసనలు తెలియజేశారు.

క్రమంగా పనామా కాలువ ప్రాముఖ్యతను కోల్పోయింది. ఇవాళ వస్తుసామగ్రిని కార్గో విమానాల ద్వారా, రోడ్డురవాణా ద్వారా దూర ప్రాంతాలకు చేరవేస్తున్నారు. ఆధునిక నౌకలు, పరిమాణంలో మరీ పెద్దవిగా వుండడం వల్ల కాలువగుండా వెళ్ళడానికి సాధ్యపడడం లేదు. పైగా పనామా దేశస్థులు ఇప్పుడు ఈ కాలువ తమ ఆస్తిగా మారిందని పోరాడసాగారు. 1977వ సం॥లో అప్పటి అమెరికా అధ్యక్షుడు జిమ్మీ కార్టర్, అమెరికా హక్కులను పనామాకు మార్చే ఒప్పందం మీదసంతకంచేశారు. 1999వ డిసెంబర్ 31వ తేదీ హక్కుల మార్పిడి కార్యక్రమం లాంఛన ప్రాయంగా జరిగింది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



డిసెంబర్ '99 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
టి. ఎమ్. ప్రణీత
న్యూబాకారం, హైదరాబాద్:500020



బహుమతి పొందిన వ్యాఖ్యలు
మొదటి ఫోటో : ప్రియమైన నేస్తమా!
రెండవ ఫోటో : నా స్వేచ్ఛకు భంగమా?